
అనుకోని అభిమానాలు అంతర్యంలో గూడుకట్టుకొన్నప్పుడు
ఒకరిని గురించి ఒకరు ఆలోచించటంతో నిద్రనిద్రపోలేకుం:
ఆ మనుషులు మాత్రం మెలుకువగానే వుంటారు.
పద్మశ్రీ-నటరత్న
యన్.టి.రామారావు
సమర్పించు
శ్రీ విజయ వేంకటేశ్వర ఫిలింస్
పవిత్ర హృదయాలు
ఆంధ్ర-సీడెడ్: జయలక్ష్మి
నైజాం: శ్రీ వెంకటేశ్వర
మైసూర్: సముద్రా మూవీస్
ఒరిస్సా - నార్త్ ఇండియా
నాగేశ్వరా ఫిలింస్
చిత్తూర్ జిల్లా: విజయనిర్మల
JAYALAKSHMI
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: A.C.త్రిలోక్‌చందర్ M.A, నిర్మాత: C.S.రాజు
సంగీతం: T.చలపతిరావు

# రోజు కొక చెంచా- శక్తిని వృద్ధి చేస్తుంది



SYRUP MINADEX

## మంచి కను దృష్టి:

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ ఎ కలదు. కంటి యొక్క దివ్యమైన దృష్టి కొఱకై రోజుకు 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ చాలును.

## ఆరోగ్యకరమైన రక్తం:

సిరప్ మినాడెక్స్‌లో ఐరన్ కూడ గలదు. భారతదేశంలో అత్యధికులు (80%) ఐరన్ లోపించిన ఆహారం భుజిస్తున్నారు. కావున 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ అతి త్వరగా ఆ లోపాన్ని నింప గల్గుతుంది.

## దృఢమైన ఎముకలు:

సిరప్ మినాడెక్స్‌లో విటమిన్ డి కూడ గలదు. ప్రతి రోజూ 1 చిన్న చెంచాడు సిరప్ మినాడెక్స్ తీసుకొన్న ఎముకలకు మంచి దృఢత్వమును కలుగజేస్తుంది గుర్తుంచుకొండి. రోజూ 1 చిన్న చెంచాడు నారింజ సువాసనగల మినాడెక్స్ బిడ్డకు మూడంతలు ఆరోగ్యరక్షణ నిస్తుంది

సిరప్

# మినాడెక్స్®

ఒకే చెంచాలో మూడు గుణములుగల టానిక్

గ్లాక్సో

CMGM-4.244 Tel




ఈ వారం ( 8—12—71 ) మీ 'సంపాదకీయం' 'ఎందు కిదంతా?' చాలా బాగుంది.

ఈ సారి ప్రచురించిన కథలు 'గడ్డి పూవు రాలిపోయింది', 'చేతులు' వాస్తవానికి చాలా దగ్గరగా ఉండి, మా మనస్సులను ఆకట్టుకొన్నాయి

—మామిడాల రాజేశ్వర్ ( వరంగల్ )

* * *

అరుణ' సీరియల్ గురించి వ్రాసిన బి ఎస్. ఈశ్వరి గారి ఉత్తరం చదివిన తరవాత ఈ ఉత్తరం వ్రాయువలె ననిపించింది.

1. అపెండిసైటిస్ ఆపరేషను పల్లెటూళ్లలో చేయువచ్చును. చేయుచున్నారు

2. ప్రయివేటు ప్రాక్టీసులో అపెండిసైటిస్‌కు ఆపరేషను చేయుటకు అసిస్టెంట్సు, అనీస్థటిస్టులు, లవసరములేదు. డాక్టరు స్పయినల్ ఎనిస్థీనియా గాని లోకల్ ఎనిస్థీనియాగాని ఇచ్చి ఆపరేషను చేయవచ్చును. పనిముట్లు అందించే వ్యక్తి ( కథలో మణి ) ఉంటే చాలు. వేరే డాక్టర్లు అవసరం లేదు.

3 అరుణ తండ్రి వద్ద పది వేలు తీసికొని ఉన్నట్లు తెలియపరిచి ఉన్నది అయినను 4,000 రూపాయలకు అపెండిసైటిస్ ఆపరేషనుకు తగినన్ని పరికరములు కొనవచ్చును ఆ విధంగా కొని జరుపుకొనుచున్న ప్రయివేటు ఆస్పత్రులు చాలా ఉన్నవి.

4 అరుణ అసిస్టెంటుగా పని చేసినట్లు వ్రాయలేదు.

ఈశ్వరి గారు విమర్శలు చేసే ముందు తాను కథ చదివి అర్థం చేసుకుంటే బావుండేది.

—రతన్ ( గుంటూరు )

## వారఫలాలు

జనవరి 5 వ తేది సంచిక నుంచి ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 'వారఫలాలు' శీర్షికను సుప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్ర విద్వాంసులు దివాకరుని వెంకటసుబ్బారావుగారు నిర్వహిస్తారని తెలియజేయడానికి ఆనందిస్తున్నాము.

—ఎడిటర్

ఈ వారంలో ప్రచురించిన ఉత్తరాల శీర్షిక చదివాను. అందులో ఈశ్వరిగారు వ్రాసిన ఉత్తరం నన్ను చాలా బాగా ఆకర్షించింది. 'అరుణ' సీరియల్‌లో

## కొత్త సీరియల్

శ్రీమతి తమిరిశ జానకి రచించిన నవల 'విశాలి' ప్రచురణ ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 29-12-1971 వ తేది సంచికలో ప్రారంభం అవుతుందని ప్రకటించడానికి ఆనందిస్తున్నాము.

—ఎడిటర్

రచయిత్రి వైద్యశాస్త్రం పట్ల పూర్తిగా న్యాయం చేకూర్చలేదు. ఈ విషయం ఈశ్వరి గారు చాలా బాగా బల్లగుద్ది వాదించినట్లుగా వ్రాశారు.

ఈ వారం రెండు కథలూ బాగున్నాయి. ప్రమదావనం బాగుంది మాణిక్యవీణ నిజం ప్రభకు మాణిక్యం వంటిదే.

—శ్రీహరి
సెంట్ జాన్స్ మెడికల్ కాలేజి ( బెంగుళూరు )

* * *

'అరుణ' సీరియల్ చాలా ఇంటరెస్టింగ్‌గా సాగుతోంది. కాని ప్రెసిడెంట్ దౌర్జన్యానికి ఎక్కడ బలి అవుతుందో నన్న భయం నన్ను పీడిస్తోంది. రచయిత్రి డి. కామేశ్వరి గారు అబలను సబలగా నిరూపిస్తారని ఆశిస్తాను. విరల్‌గారి కలం నుండి వెలువడిన 'సీతాపతి' కాలక్షేపం బఠాణీ లాగా ఉంది.

—బి జయశ్రీ ( కావలి )

* * *

'అరుణ' సీరియల్ నవల ఎంతో బావుంది ఇందులో అరుణ పాత్ర చాలా అత్యుత్తమంగ, ఆకర్షణీయంగా ఉంది.

'సీతాపతి' చదవడానికి సరదాగా ఉంది 'గడ్డిపూవు రాలిపోయింది' కథ నా కెంతో నచ్చింది

—కుమారి ఎం జయలక్ష్మి ( రాజపేట )

* * *

'అరుణ' సీరియల్ చాలా సరదాగాను, రసవత్తరంగా సాగుతూంది. 'కార్యాలయ భేతాళ విక్రమార్కీయము' అనే ఈ వ్యంగ్య రచన చాలా బాగుంది. కథలలో 'గడ్డిపూవు రాలిపోయింది' హృదయాన్ని కదిలించేదిగా ఉంది.

—తిరువీధి మోహన్‌దాస్ ( ప్రొద్దుటూరు )

* * *

'కార్యాలయ భేతాళ విక్రమార్కీయం' సీరియల్‌లో ఈ వారం ప్రచురించిన 'కౌపీన సంరక్షణార్థం' చాలా బాగుంది

ఈ సీరియల్ చదువుతూంటే 'రవి గానని చోటు కవి గాంచున్' అన్న ముక్కతిమ్మనగారి ముద్దుపలుకు గుర్తుకు వస్తుంది 'నిరుద్యోగి' గారు కార్యాలయంలోని ఉద్యోగులు, అధికార్లు, జి. ఓ.లు, కరెక్షన్ స్లిప్‌లు వీటి గురించి ఇంత క్షుణ్ణంగా వ్రాస్తున్నారంటే రవి గానని చోటు కవి గాంచి నట్లే కదా!

—వై. మధు ( విశాఖపట్నం—4. ) ★



సాలుచందా స్థానికంగా రు 26 00 — పోస్టుద్వారా రు 31 20
సంపుట 20 — సంచిక 19 — 72 పేజీలు 50 పైసలు




22-12-71

## విషయసూచిక



ముఖచిత్రం:
విజయనిర్మల

## జయ్ బాంగ్లాదేశ్ జయ్

స్వతంత్ర బాంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని భారత ప్రభుత్వం గుర్తించింది.

ఇది చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన సంఘటన.

అజేయ పరాక్రమంతో, అచంచల ధైర్య స్థైర్యాలతో వంగదేశ విమోచనం కోసం పోరుతున్న ముక్తివాహినితో కలిసి భారత సేనలు ముందు కురుకుతున్నవి.

ఈ మాటలు వ్రాస్తున్నప్పటికి జెస్సోర్ సైనిక శిబిరం పట్టణం పూర్తిగా మన సేనల కైవసమయింది. సిల్హెట్ పూర్తిగా పాక్ సేనలనుంచి విముక్తి పొందింది. కోమిల్లా దిగ్బంధనం కొనసాగుతున్నది.

ఇది పాఠకుల చేతికి అందేసరికే ఢాకా పట్టుకొనడం, బాంగ్లాదేశ్ విమోచనం పరిపూర్తి కావడం జరిగిపోవచ్చును.

మనతోపాటు భూటాన్ అప్పుడే బాంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని గుర్తించింది. ఇంకిన్ని దేశాలు ఢాకా విమోచనంతోనైనా గుర్తించక తప్పదు.

నిజానికి ఎంతకాలమో నిరంకుశ సైనిక నియంతృత్వంక్రింద నలిగిపోతూ వచ్చిన ఆ దేశంలో పాకిస్తాన్ నడిపిన ఎన్నికలలోనే షేక్ ముజిబుర్ రహమాన్, ఆయన పార్టీ ఏకైక పక్షంగా, అద్వితీయ ప్రజాభిమానం పొందిన పార్టీగా ఎన్నిక కావడం జరిగింది.

సహజంగా అలా ప్రజాస్వామ్య పద్ధతిలో ఎన్నికైనవారి రాచరికం వెను వెంటనే ఏర్పడవలసి ఉండినది. పాకిస్తాన్ సైనికనియంత కుతంత్రాలు, కుహనా నీతులతో అలా జరుగలేదు గనుకనే బాంగ్లాదేశ్ స్వతంత్రం ప్రకటించి తన దేశ విముక్తికోసం పోరాడదొడగినది.

అక్కడ పాక్ సేనల దురాగతాలు ఏ ఫాసిస్టు సేనలూ ఎక్కడా చేయలేని వన్నా అతిశయోక్తి లేదు.

నేడక్కడ తోక ముడుస్తున్న పాకిస్తాన్ మనపై విరుచుకొని పడింది. మనపై యుద్ధం ప్రకటించి హఠాత్తుగా విమానదాడులు కొనసాగించింది.

తత్ఫలితంగా పాక్ సాధించినదేమిటి? ఇప్పటికే 60 విమానాలను, 14( టాంకులను, 8 యుద్ధ నౌకలను, ఒక జలాంతర్గామిని నేలపాలు చేసుకున్నారు బాంగ్లాదేశ్‌ను పోగొట్టుకుంటున్నారు. ఆ కసితోనే పశ్చిమ రంగంలో మనపై బడిన పాక్ సేనలు చావుదెబ్బలు తింటున్నవి.

పాకిస్తాన్ ఇంతకాలం కొనసాగిస్తున్న మానవ మారణహోమాన్ని గూర్చి పెదవి మెదపని కొన్ని దేశాలు ముఖ్యంగా నిక్సన్ ప్రభుత్వం పాక్, ఇండియాలు నిద్దరినీ ఒకటిగా చిత్రింపజూచి భద్రతా సమితిలో విఫలమైనది. జనరల్ అసెంబ్లీలో నెగ్గినా భారతప్రభుత్వం అందుకు ఎలా అంగీకరిస్తుంది?

ఏమైనా లోకానికి ఎవరు దురాక్రమణదారులో తెలుసును.

త్వరలోనే బాంగ్లా విమోచనం, పాక్ సైనికయంత్ర విధ్వంసనమూ పూర్తి కాగలదని, భారత సేన విజయం సాధించగలదని విశ్వసిస్తున్నాము.

# వహా జొ క్యా వీ జా

మెడకు ఉరి పోసుకొని వేలాడుతూ దాని నుంచి విడిపించుకోవాలని తన్నుకున్న కొలది అది బిగుసు కుంటూనే పోతుంది.

యాహ్యాఖాన్ విలవిలలాడుతున్న కొలది తన ఉచ్చులో తానే మరింతగా తగుల్కొంటున్నాడు.

బాంగ్లాదేశ్‌ను నిర్మూలించాలనుకున్న అతని ఆటలు సాగక పోగా, తన సేన అక్కడ చిక్కుకున్నది.

ముక్తివాహిని చావుదెబ్బలు తీయడం ఆరంభించగానే ఇక దిక్కు తోచక ఇండియాపై హఠాత్తుగా విమానాలతో దాడి చేయించాడు.

భారతదేశంపై యుద్ధం ప్రకటించాడు. పాశవ బలోన్మాదంతో కొఱివితో తల గోక్కున్నాడు.

చేజేతులా తన దేశాన్ని తానే విధ్వంసం చేయడానికి పూనుకున్నాడు.

భారతదేశం పాకిస్తాన్ విషయంలో చూపిన సంయమం ఇంతా అంతా కాదు.

కానీ తనమీద విమానాలతో దాడి చేయడం జరగగానే ఒక్కుమ్మడిగా మన సేన విజృంభించింది.

అటు బాంగ్లాదేశ్ లోనికి మన సేన చొచ్చుకొనిపో సాగినది.

మూన్నాళ్ళలో అక్కడెక్కడా పాక్ విమానం లేకుండా ఆకాశాన్ని నిర్మలం చేసివేసింది భారత విమాన దళం.

ఢాకా వేపు ప్రయనిస్తూ మధ్య నున్న ఊళ్ళను పట్టుకుంటూ, ముక్తి సేనతో చేరి పాక్ దురాక్రమణ సేనలను తఱిమి కొడుతున్న భారత సేనకు పాక్ సైనికులు లొంగిపోతున్నారు.

ఈ నాలుగు మాటలూ చదువరులు చదువుకునే లోగానే బాంగా దేశ్ విముక్తి పరిపూర్తి అయిపోవచ్చును.

* * *

అటు పశ్చిమ రంగంలో పాక్ విమానాలు మన నగరాలపై బాంబులు వేయడం కొనసాగినా వెను వెంటనే మన విమానాలు వానిని తఱిమి వేయడమేకాక పాక్ స్థావరాలపై చావుదెబ్బలు తీస్తున్నవి.

పాకిస్తాన్ కున్న యుద్ధ నౌకలు సముద్రాంతరాళంలో ముంచివేసిన మన నౌకాబలం ఇక కోలుకొనని రీతిగా పాక్ నౌకాబలాన్ని విచ్ఛిన్నం చేసి పాఱవేసినవి.

టాంకులకు టాంకులు తుత్తునియలై పడుతుండగా పాక్ సేనలు వెనుకకు తగ్గుతున్నవి.

ముందొకమాఱు పాక్ టాంకులనెలా ఎడ్ల బళ్ళలా ముక్కలు ముక్కలు చేసి భారత సేన పురోగమించినదో పాక్ సేన లింకా జ్ఞాపకం పెటుకొనే ఉంటాయి.

విపరీతంగా జననష్టం కాకూడదన్న భావం కల మన సేనలు కీలక స్థావరాలకోసం ముందుకు సాగుతున్నవి.

ఏమైనా ఫలితం గూర్చి ఏ జ్యోతిషమూ పనిలేదు. స్పష్టంగా ఎదుట కనబడుతున్నదానిని కానలేక యాహ్యాఖాన్ ఈ ఆత్మహత్యా సదృశమైన దుందుడుకుతనానికి పాల్పడినాడు. తత్ఫలితం అనుభవిస్తాడు.

* * *

ఇంతదాకా అతి దారుణమైన మానవ మారణహోమం చేస్తున్న పాకిస్తాన్‌ను ఒక్క మాట అనని దేశాలీనాడు శాంతి ప్రవచనాలు ఆరంభించడం చిత్రాలలోకెల్లా చిత్రం.

భద్రతా సమితి ఇంతకాలం ఏం చేస్తున్నదో తెలియదు. ఇప్పుడిప్పుడే కళ్ళు తెఱచినట్టు భారత దేశాన్ని, పాకిస్తాన్‌ను ఒకే గాటిని కట్టి ఇద్దఱూ కాల్పుల విరమణ చేయాలంటూ కొన్ని దేశాలు భద్రతా సమితిలో తీర్మానం తెచ్చినవి.

అస లీ పుండు పెట్టిం దెవరు? పాకిస్తాన్ ప్రధాని అంటూ తానే అన్న షేక్ ముజిబుర్ రహమాన్ను బందీని చేసి వంగ భూమిపై రక్త స్రవంతులు పాఱించిం దెవరు?

భారతదేశంపై దండయాత్ర ఆరంభించిం దెవరు?

అద్వితీయ పక్షంగా వచ్చిన దానిని కాదని బాంగ్లాదేశ్‌ను అణచి పాఱ వేయాలని ఉరికిం దెవరు?

ఇప్పుడు భారతదేశం తిరుగు దాడి ఆరంభిస్తే, బాంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని గుర్తిస్తే, వారి విమోచన సేనకు అండదండలు కల్పిస్తే, తన దేశం మీద వచ్చి పడుతున్న సేనను వెనుకకు తఱుముతూ ముందుకు వెడితే అది తమకు అన్యాయంగా తోస్తున్నదా?

సోవియట్ యూనియన్ 24 గంటలలో రెండు సారు వీటో ఉపయోగించి ఆ తీర్మానాలను రద్దుచేయవలసి వచ్చింది.

బ్రిటన్, ఫ్రాన్సులు మటుకు తటస్థంగా ఉండిపోయినవి.

చైనా సరేసరి భారతదేశంపై దుమ్మెత్తి పోయడానికి సమితి చర్చను వినియోగించుకుంటున్నది.

ఇంకెంత ప్రయత్నించినా మన దేశం మీదికి పదే పదే రాకుండా పాక్ సేనలకు బుద్ధి చెప్పేదాకా, బాంగ్లాదేశ్ విమోచనం పరిపూర్తి అయ్యేదాకా మనకు కాల్పుల విరమణ అనే మాటకు అర్థం లేదు.

* * *

భారత ప్రధాని బాంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని గుర్తిస్తూ ప్రకటించినప్పుడు పార్లమెంటులోని వివిధ పక్ష నాయకులూ చేసిన హర్షధ్వానాలు, పలికిన ప్రశంసావాక్యాలు భారతదేశం నేడు ఏకైక వ్యక్తిగా ఈ సంక్షోభాన్ని ఎదుర్కొగలదని రుజువు చేసినవి.

ఇప్పుడు జాతి మత కుల పక్ష సిద్ధాంత విభేదా లేవీ లేకుండా భారత ప్రజానీకం యావత్తూ ఒక్క తాటి మీద నిలిచి పోరాడుతున్నది.

స్వేచ్ఛాస్వాతంత్ర్య సమర దుందుభి మ్రోయించి, పలుబాముల కగ్గమై తన విమోచనం కోసం పోరు సల్పుతున్న వంగ వీరులయెడ మనం తొలి నుంచీ సానుభూతి సహకారాలను ప్రకటిస్తూనే ఉన్నాము.

పాకిస్తాన్ యుద్ధ ప్రకటనతో, బాంగ్లాదేశ్ ప్రభుత్వాన్ని గుర్తించడంతో ఇక మనం వారికి యథేచ్ఛగా సర్వ సహాయాలూ చేయడం ఆరంభమైనవి.

బాంగ్లాదేశ్ విమోచనం ఇక కనుచూపు మేఱలో పడినది.

ఏమైనా భారతదేశం నేడు అతి క్లిష్ట దశలో నున్నది.

ఈనాడు కావలసింది ఏకీభావం, లక్ష్యశుద్ధి, సంకల్పబలం.

ఎన్నెన్ని విభేదా లున్నా ఏమున్నా ఈ నాడు వాటితో ప్రసక్తి లేదు.

మనమంతా ఒకటే; మన మీదికి దూకినవానిని ఒకటిగా ఎదుర్కొంటాం. మన దేశ ప్రాదేశిక సమగ్రతను తుది మనిషిదాకా పోరి నిలుపుకుంటాం.

ఈ సమయంలో సామాన్య ప్రజలలో కనబడుతున్న ఉత్తేజం ఎంతైనా ఉగ్గడింపదగినది.

అదే దేశభక్తి తోనే పై వారు కూడా ఈ సమయంలో సహకరించాలి. వ్యాపారులు కేవలం లాభాపేక్ష తో ఈ ఇక్కట్టును సాకు చేసుకొని ధరలు పెంచి జనదూరులు కాకూడదు.

ఎవరికి వారు ఉడతకు ఉడతా భక్తిగా దేశ రక్షణ సమాయత్త చిత్తులు కావాలి.

ఏ యుద్ధమైనా కేవలం సమర రంగం లోనే జరగదు. ప్రతి కర్మాగారంలో, కార్ఖానాలో పని చేస్తున్న ప్రతి కార్మికుడూ, ప్రతి వ్యవసాయ క్షేత్రంలో పని చేస్తున్న కర్షకుడూ, వ్యాపారీ, మేధావీ, వివిధ విభిన్న వృత్తుల లోని ప్రతి పౌరుడూ ఒక సైనికుడే. తన రంగంలో తాను కృషి చేయడం ద్వారా అతను యుద్ధంలో దేశానికి జయస్తంభం నాటగలడు.

—విశ్వం

7-12-71

# కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

(క్రిందటి సంచిక తరువాయి)

4

## కాళ్ల బేరం

"రాజా, మూడు కథలను విన్నావు. ఉద్యోగుల కర్తవ్యపాలనకు ఉపకరించే రూల్సు గురించి చాలావరకు ఆకళింపు చేసుకొని ఉంటావు. వ్యక్తి ప్రవర్తనకు ఒక్కొక్క దశలో ఒక్కొక్కరు బాధ్యులు. శైశవంలో తలిదండ్రులు, విద్యార్థిదశలో గురువులు. ప్రభుత్వోద్యోగిగా చేరాడా— అతని తరవాతి ప్రవర్తనకు బాధ్యత ప్రభుత్వానిదే. అమావాస్య చీకట్ల మాదిరి అలుముకొన్న ప్రభుత్వయంత్రాంగపు దృక్పథం, అర్థం కాని రూళ్ళు ఉద్యోగిని మరబొమ్మగా మారుస్తాయి.

సాధారణంగా ప్రభుత్వోద్యోగులంతా మూర్ఖుల లాగ కనిపిద్దామని విశ్వప్రయత్నం చేస్తారు. యంత్రాంగాన్ని, ఉద్యోగుల వైఖరిని అవగాహన చేసుకొన్న ఇద్దరు మహనీయులు సప్రమాణమైన శాస్త్రాలు వ్రాశారు.

అడుగునుండి పైకి రావడానికి అనేక స్థాయిలున్న ఆఫీసుయంత్రాంగంలో ప్రతి ఉద్యోగి విధిగా పైకి లేస్తాడు. ఈ లేవడమనేది అతని అసమర్థత పరాకాష్ఠ నందుకునే వరకు జరుగుతుంది — అని శాస్త్రీయంగా ఋజువు చేశాడు పీటర్ ప్రిన్సిపుల్‌లో.

పీటర్ చెప్పినదాని సారాంశం: ప్రతి ఉద్యోగి ఒక స్థాయిలోని పనిని సామర్థ్యంతో నిర్వహించగలడు. ఒక స్థాయిలోని పనిని సామర్థ్యంతో నిర్వహించ గలిగినంత మాత్రాన, అంతకు పైస్థాయిలోని పనినికూడా అదే సామర్థ్యంతో నిర్వహించగలడనేది తప్పు. ఉద్యోగాలలో ప్రమోషన్లుంటాయి. అంచెలంచెల మీదుగా ప్రమోషను వస్తుంటే, ఉద్యోగి ఎంతో శక్తివంతుడు, సమర్థుడు అని చెప్పుకుంటాడు. అదే తప్పు.

ఒక్కొక్క స్థాయికి ఎక్కినప్పుడల్లా, ఆ స్థాయికి కావలసిన సామర్థ్యం అతని వద్ద లోపించిందనే లెక్క చూసుకోవాలి. ఇంకా ఇంకా పైకి పోయే ఉద్యోగి అర్హతలు ఆ మెట్లకు తగినవి కావు. పైకి పోవడమనేది అతని అసమర్థత పరాకాష్ఠ నందుకునేవరకు జరుగుతుంది— అని పీటర్ వాదన.

కాబట్టి పెద్ద పెద్ద ఉద్యోగులంతా పెద్ద పెద్ద మూర్ఖులు. చిన్న చిన్న ఉద్యోగులంతా చిన్న చిన్న మూర్ఖులు. పైకి లేస్తేనే పెద్ద మూర్ఖులవుతారనేది పీటర్ ప్రిన్సిపుల్‌లోని అర్థం.

అందుచేత నే నన్నదానిలో తప్పు లేదు. ప్రతి ప్రభుత్వోద్యోగి మూర్ఖునివలె కనిపిద్దామని విశ్వప్రయత్నం చేస్తాడు. ఎంత మూర్ఖుడయితే అంత ఎత్తుకు లేవగలడని ఆశ.

నాలుగవ కథను విను.

చాలీచాలని అద్దెకొంప. అందులో ఒక ఆఫీసు. బోలెడు ఫర్నిచరు. బోలెడు ఉద్యోగులు. విశృంఖలంగా ఫైళ్లు, రికార్డులు. ఆఫీసులో సూదిమొన మోపుటకయినా జాగా లేదు. ఆఫీసుకు స్వంత భవనం కావాలని గోలయితే ఉంది గాని, ఫలితం మాత్రం లేదు. అదిగో, ఇదిగో అని సంవత్సరాలు దొర్లిపోయాయి.

ప్రతి ఉద్యోగికి ఒక సీటు ప్రత్యేకంగా ఉంటుంది. దానిలో ఒక టేబిలు, ఒక కుర్చీ, ఒక బీరువా. ఇది అతని సరంజామా. స్థలాభావం వలన ప్రత్యేకత వదులుకొని గదిమధ్యలో టేబిళ్ల నన్నిటిని ఉంచారు. వాటి చుట్టూ కుర్చీలు. టేబిళ్లపైన, కింద, చుట్టూ అంతా రికార్డులమయం. చిన్న చక్రవ్యూహం. ఈ వ్యూహంలో ఏ టేబిలు ఎక్కడ ప్రారంభమయిందో, ఎక్కడ అంతమయిందో చెప్పడం కష్టం.

ఆఫీసులో ఫర్నిచరును డెడ్‌స్టాక్ అంటారులే. కొంపతీసి నువ్వు మాతృభాషాభిమాని వేమిటి? ఇంగ్లీషు పదాలు తండోపతండాలుగా దొర్లిపోతున్నాయి. అనివార్యం. తర్జుమాకు ప్రయత్నించావా చస్తే ఎవడికీ అర్థం కాదు. మళ్లీ బ్రాకెట్టులో ఇంగ్లీషు పేరు వ్రాయాలి.

చచ్చినసరుకు అని అనువాదం చేద్దాం.

వెంటనే నీకు డౌటు రావాలి. బతికినసరుకు మాటో? బతికిన సరుకు అని ఉద్యోగుల నంటారేమోనని భ్రమపడకు.

ప్రభుత్వం జంతువుల నంటుంది బతికిన సరుకని.

ఉద్యోగులు ఈ రెండు తరహాలకు చెందని సరుకు. అంటే చచ్చినట్లూ కాదు, బతికినట్లూ కాదు.

ఉద్యోగిని గవర్నమెంటు సర్వెంట్ అంటారు.

గవర్నమెంటు సర్వెంటంటే గవర్నమెంటు సర్వెంటు అని వ్రాసి ఉంటుంది నిర్వచన ప్రబంధాలలో.

తెలుగు తర్జుమా— ప్రభుత్వపు బంట్రోతు.

డెడ్‌స్టాకును సంవత్సరాని కొకసారి తణిఖీ చేసి లెక్కలు చూడాలి. ఆ బాధ్యత ఒక ఆఫీసరుపై పడింది.

ఎల్. డి. సి. అనబడు చిన్న గుమాస్తా, క్లాస్ IV అనబడు బంట్రోతుతమము వెంటరాగా ఆఫీసరు చచ్చినసరుకు లెక్కలకు బయలుదేరాడు.

మొదటి గదిలో అడుగు పెట్టేసరికి ఆయన కళ్లు చికట్లు కమ్మాయి. ఆద్యంతాలు దృగ్గోచరాలు కాని టేబిళ్లను లెక్కించడ మెలాగ? గదిలో ఎక్కడా టేబిళ్ల ఆకారస్వరూపాలు కంటికి కనిపించలేదు. దిక్చక్రం నుండి దిక్చక్రంవరకు ఉన్నట్లున్నాయి ఫైళ్లు, రికార్డులు. వాటిమధ్య అక్కడక్కడ తలకాయలు.

ఆఫీసంతా ఇలాగే ఉందని తెలుసుగాని, ప్రత్యక్షంగా చూడడం ఇదే. ఫైళ్లను, రికార్డులను వేరొకచోటికి మార్చుటకూడా అసాధ్యం, అసంభవం.

కుర్చీలను, బీరువాలను లెక్కించాడు. మిగిలినవి టేబిళ్లు. ఫైళ్లను కదల్చకుండా టేబిళ్లను లెక్కించడ మెలాగనే ధర్మసందేహం పట్టుకొం దాయనకు.

క్లిష్టపరిస్థితులలోనే ప్రభుత్వోద్యోగి బుర్ర తీవ్రంగా పనిచేస్తుంది. అందుకే అతడు ప్రభుత్వోద్యోగి కాగలిగాడు. నువ్వూ, నేనూ కాలేకపోయాం. కొద్ది క్షణాల ఆలోచనతో పరిష్కార మార్గం తట్టింది.

టేబిళ్లను నేరుగా లెక్కపెట్టడం అసాధ్యం కాబట్టి కాళ్లను లెక్కించి నాలుగు చేత భాగించమన్నాడు మహానుభావుడు.

నవ్వకు, బాడ్‌మేనర్సు! మనం ఆక్షేపించామంటే రేపు ఉదయానికి అదే రూలుగా వస్తుంది. టేబిళ్లను లెక్కించడానికి కాళ్లను లెక్కించి నాలుగు చేత భాగించడమే సరిఅయిన మార్గమని జి. ఓ. వస్తే ఏం చేస్తావు?

సమయస్ఫూర్తితో సమస్యను పరిష్కరించి, పరిష్కారమార్గమును శిష్యుల కుపదేశించి బయటకు నడిచాడు.

ఆజ్ఞ నౌదలదాల్చి నమ్మినబంట్లు పనిని పూర్తి చేశారు. చాలా అవస్థపడవలసి వచ్చింది. టేబిళ్ల కాళ్లను మాత్రం లెక్కపెట్టడం సులభమా? వాటి చుట్టూ కంచుకోటల వలె రికార్డులు. ఎలాగో తంటాలు పడి స్పర్శజ్ఞానం చేత లెక్కను ముగించారు.

మొత్తం నలభైఏడు కాళ్లు! ! !

"సార్, సార్. తెగలేదు."

"ఏమిటి తెగలేదు? సరిగా ఏడువ్."

"టేబిళ్లు, సార్. మొత్తం నలభైఏడు కాళ్లు."

"అబ్సర్డ్. నువ్వు సరిగా లెక్క చూడలేదు. మీరంతా జీతాలు పుచ్చుకునేటందుకు తప్ప ఇంకెందుకూ పనికిరారు. కామన్ సెన్సు అక్కరలేదోయ్? నలభైఏడు కాళ్లు ఎలాగుంటాయోయ్? పద, నేను లెక్కిస్తాను."

రాజు వెడలె రవి తేజము లలరగ.

ఎలాగో నానాయాతన పడి లెక్క ముగించాడు ఆఫీసరు.

తెల్లని దుస్తులు ధూళి ధూసరమయాయి.

నడుం నొప్పి పట్టింది.

కాని కాళ్లు మాత్రం నలభైఏడే.

"అవునోయ్, నువ్వన్నది నిజమే. ఏం చేస్తాం మరి? లిస్టులో రాసుకో."

"ఏమిటి, సార్, కాళ్లా, టేబిళ్లా?"

ఆఫీసరు సమాధానం చెప్పలేక మొహం చిట్లించాడు.

ఆజ్ఞాబద్ధుడగు ఎల్. డి. సి. లిస్టులో వ్రాసుకున్నాడు.

'ఎన్నిసార్లు లెక్కించినప్పటికి తేలిన కాళ్లు 47 = $11\frac{3}{4}$ టేబిళ్లు.'

కథ కమామీషు విన్నావు. $11\frac{3}{4}$ టేబిళ్లు ఎలాగ వచ్చాయి? రికార్డులను కదపకుండా మొత్తం ఎన్ని టేబిళ్లో తెలుసుకోవడ మెలాగో చెప్పు, చూదాం?" అని భేతాళుడు ప్రశ్నించాడు.

"వారు ముగ్గురు విడివిడిగాను, కలిసికూడా లెక్కించారు. అయినప్పటికీ సంఖ్య మారలేదు. కాబట్టి మొత్తం 47 కాళ్లు రైటేనని తేలింది.

సాధారణంగా కొన్ని కొన్ని ప్రభుత్వ కార్యాలయాలలో కుర్చీలకు, టేబిళ్లకు అన్ని అవయవములు సరిగా




## వెయ్యేళ్ల శిక్ష

అభిమానం పుట్టుకొస్తే మనవాళ్ళు 'వెయ్యేళ్లు వర్ధిల్ల'మని ఆశీర్వదిస్తారు. అలాగే ఆగ్రహం వస్తే వెయ్యేళ్లు కఠినశిక్ష విధించవచ్చు. రాజకోటలో అదే జరిగింది. పాకిస్తాన్ నియంత సాగిస్తున్న దురాగతాలు, బంగ్లా దేశ్‌లో పాక్ సైనికులు జరుపుతున్న ఘోరాలు వినివిని, అక్కడ మునిసిపల్ ఛైర్మన్ ప్రధాన న్యాయ మూర్తిగా ఒక న్యాయస్థానం ఏర్పాటైంది. ఆ న్యాయ స్థానం యాహ్యాఖాన్‌కు సజీవ దహనశిక్ష, అతని కుడి భుజమైన భుట్టోకు వెయ్యేండ్ల కఠిన కారాగారం, ఎడమ భుజమైన తిక్కాఖాన్‌కు అయిదు వందల ఏండ్ల కఠిన కారాగారశిక్ష విధించింది. ప్రాసిక్యూషన్ తరఫున, ముద్దాయిల తరఫున ఆరుగురు విద్యార్థులు వాదించారు. యాహ్యా బొమ్మను నగరం మధ్యలో దహనం చేసి శిక్షను అమలు జరిపారు.

## ఇంగ్లీషువల్ల లాభం

ఇంగ్లండులో ఉంటున్న ఒక భారతీయ మహిళ నిర్మల చౌహాన్ సూపర్ మార్కెట్‌లో అవీ, ఇవీ కొని రు. 17 లు కిమ్మతు గల వస్తువులు తస్కరించింది. మార్కెట్ యజమానులు ఆమెపై కేసు పెట్టారు. కోర్టువారు ఆమెకు రు. 9 లు జరిమానా విధించారు. ఆమెకు ఇంగ్లీషు సరిగా రాకపోవడం వల్ల, ఆమె భర్త కోర్టులో దుబాసీగా వ్యవహరించాడు. కోర్టులో పేమెంటు ఆఫీసుకు వెళ్లి రు. 9 లు జరిమానా చెల్లించి, అతను దుబాసీగా వ్యవహరించినందుకు కోర్టువారు ఇవ్వవలసిన రు. 120 లు జేబులో వేసుకుని బయట పడ్డాడు. జరిమానా కట్టగా మిగిలిన లాభం రు. 111. బావుంది. ఇంగ్లీషు రాకపోవడం వల్ల వచ్చే లాభం కంటే, ఇంగ్లీషు రావడం వల్ల వచ్చే లాభమే ఎక్కువ.

## తాజ్‌మహల్‌లో తాంబూలాలు

మనవారు పెళ్లికి ముందు నిశ్చయ తాంబూలాలు పుచ్చుకుంటారు గదా! పెండ్లి కొడుకు తరఫు పెద్దలు పెండ్లి కూతురు తరఫున వారిని కలుసుకుని బేరాలు కుదుర్చుకుని, లాంఛనాలు సెటిల్ చేసుకుని, 'శుభం' అనుకుని తాంబూలాలు పుచ్చుకుంటారు. అమ్మాయి, అబ్బాయిలు పెళ్లి చూపులు జరుగుతాయి. ఉత్తర భారత దేశంలో 'తాజ్‌మహల్'—షాజహాన్ ప్రేమ మందిర ప్రాంగణం ఇప్పుడు ఈ తాంబూలాల తతంగానికి కేంద్రమైంది. పెళ్లికొడుకు, పెళ్లికూతురు అక్కడ లాన్స్‌లో నడుస్తూ, మనస్సులు విప్పి చెప్పుకుని, ప్రేమ బీజాలు నాటుకుంటున్నారు. ఈలోగా పెద్దలు బేరాలు సెటిల్ చేసుకుని తాంబూలాలు తీసుకుంటున్నారు. 'తాజ్‌మహల్' ప్రాంగణంలో పెళ్లిళ్లు సెటిల్ అయితే, ఆ దంపతులు ప్రేమజీవులై చిరకాలం వర్ధిల్లుతారని ఆశ.

## కీళ్ల నొప్పులు - రాగి మురుగులు

కీళ్ల సంబంధమైన నొప్పులకు, వ్యాధులకు ఏ మందులు పని చేయకపోయినా, రాగిలో చేసిన మురుగులు ధరిస్తే చాలు — అద్భుతమైన ఫలితాలు కనిపిస్తాయి. మన శరీరంలో విద్యుత్తు స్తబ్ధంగా ఉంటుంది. విద్యుత్ వాహక శక్తి రాగికి ఎక్కువగా ఉన్నట్లు అందరికీ తెలిసిందే. రాగి మురుగులు ధరించడం వల్ల శరీరంలోని విద్యుత్తు ఆ మురుగుల ద్వారా నరాలకు ప్రసరిస్తుంది అనేకమైన నరాల నొప్పులు, కీళ్ల నొప్పులు రాగి మురుగులు పోగొడుతున్నాయి డాక్టర్లు కూడా ఇవి ధరిస్తున్నారు. అవి తీసివేసిన రెండు రోజుల్లో కీళ్ల నొప్పులు యథాతథంగా రావడం జరుగుతున్నది. స్త్రీలు కూడా బంగారు గాజులకు బదులు రాగి గాజులు ధరిస్తున్నారట.

## ఉచ్ఛ్వాస నిశ్వాసాలు

ప్రాణుల వలెనే భూమి కూడా గాలిని పీల్చడం, వదలడం ఉంటుంది. మనం గాలిని లోపలకు పీల్చినప్పుడు గుండె పెద్దదవుతుంది. వదిలినప్పుడు తగ్గుతుంది. అలాగే చంద్రుని ప్రభావంవల్ల, కొంతవరకు సూర్యుని ప్రభావం వల్ల భూమి కూడా రోజూ ఊపిరి పీల్చి, వదులుతుంది. అప్పుడు భూమి ఉపరితలం సంకోచించడం, వ్యాకోచించడం జరుగుతుంది. మాస్కో నగరం ఈ విధంగా రోజూ 40 సెంటీమీటర్లు పైకి, క్రిందకూ ప్రయాణం చేస్తున్నదట. సంకోచ వ్యాకోచాలు భూమధ్యరేఖ వద్ద ఎక్కువగానూ, ధ్రువాల వైపు పోనుపోనూ తక్కువగానూ ఉంటవి. చంద్రునికి, భూమికి మధ్య దూరాన్నిబట్టి భూమి సంకోచ, వ్యాకోచ పరిమాణం మారుతుంటుందట.

## చేతికర్ర

లండన్‌లో హైడ్ పార్కు చాలా ప్రసిద్ధమైంది. బాగా డబ్బు గలవారు అక్కడ పొద్దున పూట గుర్రాలెక్కి షికారు వస్తారు. అక్కడ ఒక పెద్ద మనిషి చచ్చి పడి ఉన్నాడు. ప్రక్కనే చేతి కర్ర. స్కాట్‌లాండ్ యార్డ్ పరిశోధకులకు ఆ హత్య ఎవరు చేసిందీ, ఎలా జరిగిందీ అంతుబట్టలేదు. ఏ ఆయుధంతో హత్య చేసిందీ అర్థం కాలేదు. అయితే, మృతునిపై తుపాకి కాల్పులు కనిపించింది. ఎక్కడా తుపాకీ లేదు. చివరకు ఆ పెద్దాయన చేతికర్రే ఒక పిస్టల్ అని తేల్చారు. చేయి పట్టుకునే చోట రహస్యంగా ట్రిగ్గర్ ఉన్నది. అలా చేతి కర్రలలో పిస్టల్ తయారు అవుతున్నాయని అపరాధ పరిశోధకులకు తెలియుటు.

## గడ్డ పెరుగు

పాలు పౌష్టికాహారమని మనకు తెలుసు. అంతకు మించినది గడ్డ పెరుగు. గడ్డ పెరుగును ఎక్కువసేపు నూనెలో వేయించడం వల్ల, మాంసం అంతటి బలవర్ధక ఆహారం అవుతున్నదని అమెరికా ఆహార సంస్థ కనిపెట్టింది. చిలికిన పాలల్లో కాల్షియమ్ క్లోరైడును కలిపితే పెరుగు అవుతుంది. పెరుగును ముక్కలుగా కోసి, కాస్త నూనెలో వేయించాలి. ఈ వేయించిన పెరుగు రెఫ్రిజిరేటర్‌లో ఉంచితే రెండు వారాల వరకు చెడిపోదట. స్టెరిలైజ్ చేస్తే మూడు నెలల వరకు ఉంటుంది ఏమైనా ఇది మంచి బలమైన ఆహారం.

## బుల్లి చందమామలు

మనకొక చందమామ ఉన్నాడు గదా, ఆ చందమామ పైకి షికారుగా వెళ్లిరావడమూ జరుగుతున్నది గదా. అలాగే పనిలో పనిగా, అంగారక గ్రహం వైపు రాకెట్లను పంపారు అమెరికావారు. మారినర్—9 అనే రోదసీనౌక, అంగారకుని దూరంగా ఉండి, తీసినఫోటోలలో అంగారకుని చుట్టు రెండు బుల్లిచందమామలున్నట్లు కనిపెట్టారు. వాటికి దియమోస్ ఫోబోస్ అని నామకరణం చేశారు. దియమోస్ వ్యాసం 10 కిలోమీటర్ల లోపేనట.

## జలాంతర్గత ప్రణయం

హంగరీదేశంలో ఒక జంట తాతా సరస్సులో దూకి, 11 మీటర్ల లోతుకు వెళ్లి అక్కడ పెళ్లి చేసుకున్నారు. వారిద్దరూ జలశోధకులే. ఈత దుస్తులు ధరించి, నీళ్లలో దూకారు ఈ పెళ్లికి వచ్చిన 40 పెద్దలు, ఒడ్డున ఉన్నారు. మైక్‌ద్వారా వారి పెళ్లిప్రమాణాలు ప్రసారం చేశారు.

—శార్వరి

---

ఉండాలనే బాధలేదు. మనుష్యులలో కుంటివాళ్లున్నట్లే, టేబిళ్ళలోకూడా కుంటివి ఉండవచ్చు. మనిషికి కాలు విరిగితే ప్లాస్టిక్ సర్జరీతో వేరొక కాలు పెడతారు. కుంటికాలు టేబిలుకు రికార్డులను, ఫైళ్లను ఆధారంగా పెట్టి సర్జరీ చేస్తారు ఉద్యోగులు. ఎక్కడయినా టేబిలుకు నాలుగు కాళ్ళుగాని ప్రభుత్వకార్యాలయాలలో క్రింది తరగతుల టేబిళ్ళకు ఒకటి నుండి నాలుగు వరకు ఎన్ని కాళ్ళయినా ఉండవచ్చును. కాబట్టి 47 కాళ్లలో విడ్డూరం లేదు.

47 కాళ్ళు $= 11\frac{3}{4}$ టేబిళ్ళు $= 12$ టేబిళ్ళని కూడా చెప్పలేం.

మొత్తం ఎన్ని టేబిళ్లో తెలుసుకోవాలంటే, ఆ సెక్షనులోని వారి నడిగితే సరిపోయేది. కాని, ఉద్యోగి నిజం చెప్పినప్పటికి మరొక ఉద్యోగి దానిని నమ్మకూడదనేది కార్యాలయాలలోని వర్కింగ్‌ఫార్ములా. కాబట్టే ఆఫీసరు టేబిళ్ల నాదిలి కాళ్ళబేరానికి దిగి చిక్కులలో పడ్డాడు.''

విక్రమార్కుని సమాధానం పూర్తయింది.

(సశేషం)

# హైదరాబాదు లేఖ

## కొత్తరకం నాటకం

రవీంద్ర భారతి కిటకిటలాడుతున్నది నాటకం ఎప్పుడెప్పుడు ఆరంభ మవుతుందా అని అందరూ కుతూహలాయత్తచిత్తులై తెరపైపే చూస్తున్నారు. సల్లని తెర ప్రేక్షకుల చూపులకు తట్టుకోలేక ఎప్పు డెప్పుడు పైకి లేద్దామా అని కదలాడుతున్నది. ఉత్సుకతకు పరాకాష్ఠ అన్నట్టు నిశ్శబ్దం వ్యాపించిఉంది.

ఆ సమయంలో — సభ్యులయిన ప్రేక్షకులంతా ఎంతో ఓపికతో వేచి ఉన్న ఆ సమయంలో — హాలు నాలుగు మూలల నుంచి కేకలు వినిపించాయి — ఎంతసే పయ్యా! తెర ఎత్తు! మా ఓపికను పరీక్షిస్తున్నారా? అని. పిల్లలు, అదేమిటో తెలియక పెద్దలు హడలి పోయారు. గోల క్షణ క్షణానికీ ఎక్కువయింది. నాటక నిర్వాహకుడు పరుగెత్తి వచ్చి తెరముందు నిలబడ్డాడు. గోల చేయవద్దని, నాటకం ప్రారంభ మవుతుందని వంగి వంగి నమస్కారాలు పెడుతూ మనవి చేశాడు.

నాటకం ఆరంభ మయింది. నాటకం 'బిల్లీ చలీ వహన్ కె జూతా' ('పిల్లి బయలు దేరింది చెప్పులు వేసుకొని') 1797 లో జర్మన్ రచయిత లుడ్విగ్ టీక్ రచించిన కట్టు కథ 'పుస్ ఇన్ బూట్స్' ఆధారంగా శ్రీ ఉల్ఫ్రామ్ మెహ్రింగ్ రచించిన నాటకానికి హిందీ అనువాదం. దీనికి దర్శకుడు ఉల్ఫ్రామ్ మెహ్రింగే! దీనిని గడచిన నవంబర్ 26 వ తేదీన దిశాంతర్, స్థానిక మాక్స్ ముల్లర్ భవన్ ప్రదర్శిం చాయి దిశాంతర్ 1967 లో ఢిల్లీలో నెలకొల్పబడిన నాటక ప్రదర్శన సంస్థ.

"పాతబడి జడప్రాయమైన ప్రాచీన రూపక సంప్రదాయాలను వ్యంగ్యంగానైనా కటువుగా విమ ర్శించే నాటకాన్ని, సర్వకాలాలకు, సర్వ సంస్కృతులకు అనుగుణమైన ఇతివృత్తంతో వ్రాయదలచాను. అందువల్ల ఈ నాటకాన్ని జర్మనీ, ఫ్రాన్సు, తదితర పాశ్చాత్య దేశాలలో ప్రదర్శించినదానికన్నా భిన్నంగా భారత దేశంలో ప్రదర్శించవలసి వచ్చింది. సాంస్కృ తిక సిద్ధాంతాలూ, రూపక స్త్రోత్రాలూ ఎప్పటికప్పుడు మారిపోతున్నాయి అని ప్రస్తుత సమాజాలకు సంబద్ధంగాను, నూతన భావ స్వరూపాలకు మార్గ దర్శకాలుగాను ఉండాలి" అంటాడు ఉల్ఫ్రామ్ మెహ్రింగ్.

అందువల్లనే ఈ నాటక ప్రదర్శకులు నటునికి, ప్రేక్షకునికి గల సాంప్రదాయికమైన విలక్షణతను మార్చివేసే లక్ష్యంతో ప్రేక్షకుడు కూడా నాటక ప్రదర్శనంలో భాగస్వామి అయ్యే నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికి ప్రయత్నించారు. ఈ సిద్ధాంతంలో భాగమే నాటక ప్రారంభంలో గోల. గోల చేసిన వారు నాటక సంఘం వారే! బ్రెచ్ట్ (Brecht) అనే నూతన జర్మనీ ఆలంకారిక శాస్త్రజ్ఞుని సంప్రదాయం ప్రకారం ఈ ప్రేక్షకుల జోక్యం పద్ధతిని తెలియ చెప్ప డానికే ఈ గోల. వారు ప్రతి రంగం చివర, ఒకోకప్పుడు మధ్యన జోక్యం చేసుకొని, విమర్శిస్తారు "ఏమి నీ పీడ నాటకం? ఏమిటి నీ అభినయం? ఇతివృత్తం పాత చింతకాయ తొక్కు?" — ఇత్యాదిగా. ఎప్పటి కప్పుడు నాటక నిర్వాహకుడు వచ్చి, వారిని సమాధాన పెడుతూంటాడు. ఈ ఆక్షేప సమాధానాల మధ్య నాటకం సమాప్త మవుతుంది.

ఈ నాటకం కథ ఇదీ సంగ్రహంగా: ఒక బీద రైతు, అతనికి ఒక కుమారుడు. తండ్రి మరణం వేళకు పిల్లి తప్ప మరేమీ లేదు ఆస్తి కుమారునికి కుమారుడు ఏమి గతి అని విలపిస్తాడు. అప్పుడు పిల్లి మనుష్య భాషలో—"నాయనా, నీ కేమీ భయం లేదు. నిన్ను రాజును చేస్తాను" అని వాగ్దానం చేస్తుంది. రైతు కొడుకు నిశ్చింతగా ఉంటాడు.

ఈ పిల్లి సాధారణమయిన పిల్లి కాదు కదా! పరిసరా రణ్యాలకు వెళ్ళి వేటాడి, కుందేళ్ళు, పక్షులను చంపి, ఆ దేశం రాజుకు 'కారబాస్ రాకుమారుడు' అన్న పేరుతో బహూకరిస్తుంది. రాజు ఇలా మాంసం నిత్యం సేవిస్తూ (ఆయనకు కుందేలు మాంస మంటే చాలా ఇష్టం) ఒకమారు మర్యాదకోసం ఆ రాజ కుమారుని చూడడానికి వెళ్ళతాడు. పిల్లి అతనికంటే ముందుగా మాయ పాద రక్షలతో వెళ్ళి, రాజు వచ్చే టప్పుడు, ఆ దేశమంతా కారబాస్ రాజకుమారునిదేనని చెప్పమంటుంది జనాన్ని. కాని, నిజానికి ఆ భూమి పోపంజ అనే మరోక రాజుది. ఆయనను పిల్లి మాయతో ఎలుకగా మార్చితినివేస్తుంది. దగ్గరిసరోవరం వద్ద రైతు కుమారుడు పిల్లికోసం వేచిఉంటాడు రైతు కుమారుణ్ణి గుడ్డలు విడిచి సరోవరంలో దూకమంటుంది పిల్లి. రైతు కుమారుడు సరోవరంలో దూకగానే రాజకుమారుడుగా మారుతాడు వానిని పిల్లి రాజు చూస్తుండగా రక్షించి, దానిని దొంగలు కొట్టా రని, అతడే తన యజమాని అని రాజుకు చెబుతుంది. రాజు ఆశ్చర్యపడి, అతనికి సహాయం చేస్తాడు. ఎవరు వచ్చినా నిరాకరిస్తున్న రాజకుమారి వెంటనే ఆ రైతు రాకుమారుణ్ణి ప్రేమిస్తుంది పిల్లి ఈ విధంగా తన ప్రతిజ్ఞను — "నిన్ను రాజును చేస్తాను" అనే దానిని — నిర్వహించుకొంటుంది.

ఈ కథలో రాజాస్థానం తీవ్రంగా విమర్శించబడింది. విదూషకుడు, రాజాస్థానా చరిత్రకారుడు, మంత్రి మొదలయినవారు ఎంత ఇచ్చకాలవారో, మూర్ఖు డైన రాజును ఎంత ప్రతారిస్తారో చూపబడింది

కథ నడుస్తుండగా, ప్రేక్షకులలో కొందరు (వాళ్ళ వారే) లేచి—"ఏమిటయ్యా ఇది? ఇలాటి కట్టు కథను చూపుతున్నావు? మాకు రసధ్వని, భరతనాట్యం కావాలి" అంటారు. నాటక నిర్వాహకుడు వచ్చి, వారిని రంగస్థలంలోకి రమ్మని ఇది భరతుని నాట్య శాస్త్రానికి విరుద్ధం కాదంటూ, వారితోను, పాత్ర తోను నాట్యం చేస్తాడు. అంతా గోలగా, రంజకంగా ఉంటుంది.

రంజకతకోసమూ, కళ కాల దేశాదులకు అతీత మయిం దనడం కోసమూ కొన్ని పాత్రలకు చైనా ఆహార్యం కల్పించబడింది. పిల్లిగా సుధా శివపురీ, ఓ రాజుగా ఓమ్ శివపురీ, విదూషకుడుగా బి. ఎమ్. షా, రైతు కుమారుడుగా కుముద్ నాగర్ల నటన చెప్ప దగింది.

ఏమైనా ఈ కొత్త పద్ధతి — అసలే గోలచేసే సదస్యులతో కిటకిటలాడే మన ప్రదర్శనాలలో ఎంత వరకు రంజకంగా ఉంటుందో, ఎంతవరకు గ్రాహ్యంగా ఉంటుందో ఏమో!

### ఉపశ్రుతి

నాటక రంగంలో ఎంత విప్లవం ఉత్పత్తిల్లుతున్నా పాత తరం నటులు, మూడు తరాల వారు కనిపించి నప్పుడు ఒళ్లు జుమ్మంటుంది. ఇలాటి అనుభవం శ్రీ ఈలపాట రఘురామయ్యగారిని దర్శించినప్పుడు కలిగింది.

సికిందరాబాద్ శాఖ స్టేట్ బాంకి సిబ్బంది తాలూకు లోకల్ ఇంప్లిమెంటేషన్ కమిటీవారు నవంబరు 29 న రవీంద్ర భారతిలో రెండు తెలుగు నాటికలు— 'కుక్కపిల్ల దొరికింది', 'కథ కంచికి', ఆ బాంకి ఉద్యోగి శ్రీ ఘాజీ రచించి, నటించిన 'బాంక్ రాబ్డ్ బై ఇట్స్ స్టాఫ్' — ఇంగ్లీషు నాటిక ప్రదర్శిం చారు. ఈ ప్రదర్శనకు ముఖ్యాతిథి ఈలపాట రఘురామయ్యగారు.

ఏడు పదులు దాటిన రఘురామయ్యగారు సింహ సంహననంతో "నాటకాలలో జీవించాలనేదే నా బ్రతుకు, నా యోగం. సినిమా కేవలం నీడ నాటకం సజీవం. జనం ఉన్నంతవరకు నాటకం ఉంటుంది. దానికి ఏ నిర్జీవ రూపకమూ పోటీ కాదు" అని తెగవేసి చెప్పి నప్పుడు పాతతరం వారి నాటకైక జీవితం, సుస్థిరత అంటే ఏమిటో ఈ తరం వారికి అర్థమయింది.

"నా పేరు వెంకట సుబ్బయ్య. నేను 1912 లో 'రామదాసు' నాటకంలో రాముని వేషం వేశాను. దేశో ద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు నా నటనకు ముగ్ధులై—'రఘురామా!' అని పిలిచారు. అప్పటి నుంచి నాకు రఘురామయ్య అనే పేరు పడింది" అని ఆయన అని ప్రేక్షకులకు మరింత ఆశ్చర్యం కలిగించారు.

డెబ్బయి రెండేండ్ల ఆ వృద్ధ నట శిఖామణి ఆ రోజున ఈలపాట అనాయాసంగా పాడడం విన్న నా వంటి వారికి అది అర్ధ శతాబ్ది కింద విన్న సొంపు జ్ఞాపకం చేసి, 1928 లో ఆయన శకుంతల పాత్ర తిలకించిన రవీంద్ర కవీంద్రుడు 'నైటింగేల్ ఆఫ్ ఆస్ట్రండియా' అని ప్రశంసించడమూ తటాలు మనసులో మెరిపించి 'కాలాయ తస్మై నమః' అని తల వంచేట్టు చేసింది.

—తిరుమల రామచంద్ర

4—12—7

# ముఖ్యమైన వార్త



ఇప్పుడు నెలసరి రు. 5/- ల వాయిదా చెల్లుబడి మీద ప్రసిద్ధి చెందిన 1971 మాడెల్ **తోషిబా** ట్రాన్సిస్టర్లు కొనండి. 5 సం. లు గ్యారంటీ, వాతావరణ ప్రభావం లేనిది. చక్కటి క్యాబినెట్‌లో రంగులైటు అమర్చబడినది. వెల భారీగా తగ్గించబడినది. కొనువారు తమ పూర్తి పేరు, సరైన అడ్రసు ఇంగ్లీషులో పంపవలెను. సరుకు పార్సెలు ద్వారా పంపబడును.

**RELIABLE TRADERS (WAP), Post Box 5732, New Delhi-55.**

## సైనిక స్కూలు, కోరుకొండ

### 1972 వ సంవత్సరమునకు 5 వ క్లాసులో మాత్రమే ప్రవేశము

ప్రవేశ పరీక్ష 1972 ఫిబ్రవరి 19, 20 తేదీలలో కోరుకొండ, ఏలూరు, గుంటూరు, అనంతపూరు, తిరుపతి, హైదరాబాదు, నిజామాబాదు కేంద్రములలో జరుగును

**వయోపరిమితి:**— 2—7—1962 మరియు 1—7—1963 (రెండు తేదీలతో సహా) మధ్య పుట్టిన బాలురే ఈ ప్రవేశ పరీక్షకు అర్హులు

**విద్యార్థి వేతనములు** (స్కాలర్‌షిప్‌లు) — ఈ క్రింది విధముగ నెలసరి ఆదాయము కలిగి ఆంధ్రప్రదేశ్‌కు చెందిన వారి పిల్లలకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారి ఉదారమైన విద్యార్థి వేతనములు లభించగలవు.

| తల్లిదండ్రుల నెలసరి ఆదాయము | | పిల్లవానికి తల్లిదండ్రులు భరించవలసిన సాలీనా ఖర్చు |
|---|---|---|
| ఏ. రు. 0— 300 | — | అతి స్వల్పము |
| బి. రు. 301— 600 | — | రు 325 |
| సి. రు. 601—1000 | — | రు 835 |
| డి. రు. 1001—1600 | — | రు 1350 |

సెక్యూరిటీ డిపాజిట్‌గా ప్రతి విద్యార్థి అదనంగా మొదటి సంవత్సరంలో మాత్రమే చెల్లించవలసినది రు. 150.

పై చెప్పబడిన సి డి విద్యార్థి వేతనములు పొందువారు మొదటి సంవత్సరంలో మాత్రమే బట్టలకు గాను అదనముగా రు 150 లు చెల్లించవలెను.

నెలసరి ఆదాయము రు. 1600 లు దాటిన వారు తమ పిల్లలకు సంవత్సరమునకు చెల్లించవలసినది దాదాపు రు. 2400 లు. ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైన బాలురలో మొదటి ఐదుగురకు, వారి తల్లిదండ్రుల ఆదాయముతో నిమిత్తము లేకుండగనే, పై వ్రాసిన 'ఏ' తో సమానమైన ఉత్తమ విద్యార్థి వేతనములు ఇవ్వబడును.

రక్షణబలములలో పనిచేసిన లేక పనిచేస్తున్న వారి పిల్లలకు అఖిల భారత స్థాయిలో దేశరక్షణ శాఖ వారి కొన్ని విద్యార్థి వేతనములు కూడ కలవు.

యానాంకు చెందిన బాలురు కోరుకొండ సైనిక స్కూలులో చేర్చుకోబడుదురు. వీరికి భారత ప్రభుత్వపు గృహ మంత్రిత్వ శాఖ వారి విద్యార్థి వేతనములు లభించగలవు.

షెడ్యూల్డు జాతుల/తెగల వారి పిల్లలు ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైనంత మాత్రముననే, మెరిట్‌తో సంబంధము లేకుండ, ఈ స్కూలులో చేర్చుకొనబడుదురు.

విద్యార్థి వేతనములు పొందిన బాలురు, ఎన్నుకోబడినచో, నేషనల్ డిఫెన్స్ ఎకాడమీలో చేరవలసి ఉన్నది. ముందుగా ఎటువంటి సూచనలేకయే ప్రవేశ పరీక్ష విధానము మార్చబడవచ్చును.

పూర్తిచేయబడిన దరఖాస్తు ఫారములు 5 రూ. ల పోస్టల్ ఆర్డరుతో సహా (రిజిస్ట్రేషన్ ఫీసుకు గాను) 20—1—1972 వ తేదీ లోపు స్కూలుకు చేరవలెను.

ప్రవేశపరీక్షకు దరఖాస్తు ఫారములు, ఇంగ్లీషు లేక తెలుగులో మాదిరి ప్రశ్న పత్రములతో కూడిన స్కూలు ప్రోస్పెక్టస్ (నిబంధనావళి) రు. 3 లు మనిఆర్డర్ ద్వారా ఈ క్రింది చిరునామాకు పంపి పొందండి.

**ప్రిన్సిపాల్,**
సైనికస్కూలు, కోరుకొండ, వి ఐ.
విశాఖపట్నంజిల్లా. ఎ పి



స్త్రీలకు శత్రువు ఎవరు?....

పేలు....ఈపి....చుండ్రు
ఇవి మూడు
స్త్రీలకు గర్భశత్రువులు!
వీటిని స్త్రీలు
దగ్గరకు చేరనీయరాదు!
కానీ—
అవే స్త్రీలదగ్గరకు చేరితే
ఏం చెయ్యాలి?....

అశ్రద్ధ
చేశారా?
అందమయిన ఒత్తు అయిన
జుట్టు
మీకు అందకుండా రాలిపోతుంది!
అందుకే వాడండి....

**లాజిన్**
లాజిన్
వలన జుట్టు ఊడదు!
నోటికి, కండ్లకు తగిలినా
ప్రమాదంలేదు!
కళ్ళు, తల
మంటపుట్టవు!
చిన్న పిల్లలుకూడా
నిర్భయంగా వాడతగినది!

**అందుకే నేడే ఒక లాజిన్ సీసా కొనండి!...**




డిస్ట్రిబ్యూటర్సు: శ్రీనివాస మెడికల్ & ఫ్యాన్సీ మార్టు
శేపల్లె, వరంగల్. హైదరాబాద్, విజయవాడ.

Geetha VIJAYA

# వారఫలాలు

—పి. వి. రావు

**22-12-71 నుంచి**
**28-12-71 వరకు**

## మేషం [అశ్వ భర కృత్తి 1 పా.]

గ్రహస్థితి ఆనందదాయకంగా ఉంది. ప్రాతికూల్యం ఉండదు. స్నేహితులు సహాయం చేస్తారు. పరిస్థితులు అనుకూలంగా ఉంటాయి. తల్లితో, స్నేహితులతో విభేదాలు లేకుండా చూడడం అవసరం. వారం ప్రారంభంలో పిల్లలలో ఒకరు ఆశ్చర్యం కలగజేసే పని చేస్తారు. వ్యాపారస్థులకు భాగస్వామ్యం విశేషంగా లాభిస్తుంది.

## వృషభం

[కృత్తి 2, 3, 4 పా. రోహి మృగ 1, 2 పా.]

గ్రహస్థితి ఇదివరకటి కన్న ప్రోత్సాహ కరంగా ఉంది. వృద్ధులు ఒకరు మీ కార్యక్రమాలు అన్నిటా మీకు చేయూత నిస్తారు. ఖర్చు పెరుగుతూ ఉన్నా డబ్బుకు లోటు ఉండదు. ఆరోగ్యం విషయంలో జాగ్రత అవసరం. ప్రయాణ సూచన ఉంది. వివాహ ప్రయత్నాలు జరుపుతారు. కుటుంబ జీవితం ఆనంద దాయకంగా ఉండదు. ఉద్యోగంలో యజమాని అనుగ్రహానికి పాత్రులవుతారు. వ్యాపారస్థులకు విశేషమైన లాభాలు చేకూరతాయి.

## మిథునం

[మృగ 3, 4 పా. ఆరు పున 1, 2, 3 పా.]

పిల్లలలో ఒకరు ముందుకు వస్తారు. వివాహం సందర్భంలో ప్రయాణం చేసే అవకాశం ఉంది. సామాజికంగా పలుకుబడి పెరుగుతుంది. ఆర్థిక స్థితి బాగా ఉంటుంది. నగలు, బట్టలు కొంటారు. ఉద్యోగంలో మంచి మార్పు వస్తుంది. వ్యాపారస్థులకు విశేషమైన లాభాలు చేకూరతాయి.

## కర్కాటకం [పున 4 పా పుష్య ఆశ్లే.]

చాలా మంచి కాలం. ఉద్యోగంలో మాత్రం స్వల్పమైన చికాకులు ఉంటాయి. శ్రమపడకుండా డబ్బు సంపాదిస్తారు. స్నేహితుల మీద ఆధారపడరాదు. పాత స్నేహితులు కొందరు మిమ్మల్ని విమర్శించడం జరుగుతుంది. వివాహం సందర్భంలో ప్రయాణం చేసే అవకాశం ఉంది. వ్యాపారస్థులకు స్పెక్యులేషన్ విశేషంగా లాభిస్తుంది. భాగస్వామ్యం కూడా బాగా సాగుతుంది.

## సింహం [మఖ పూ. ఉ. 1 పా.]

కార్యక్రమాలు నిదానంగా సాగినా, డబ్బు చేతికి రావడంలో జాప్యం జరిగినా ఇది సంతృప్తికరమైన కాలం. భగవదనుగ్రహం ఉంది. పెద్దలద్వారా, వివాహం మూలంగా ధనం లభిస్తుంది. బంధువర్గంలో ఒక స్త్రీ మూలంగా ధన లాభం చేకూరుతుంది. స్వగ్రామానికి వెళ్ళే అవకాశం ఉంది. ఇల్లు, కుటుంబ పరిస్థితి మెరుగు పరచడానికి కృషి చేస్తారు. మీ ఆరోగ్యం విషయంలో శ్రద్ధ చూపవలసిన అవసరం ఉంది. పిల్లలు ఆందోళన కలగ జేయవచ్చు. ఉద్యోగంలో యజమాని అనుగ్రహం లభిస్తుంది. వ్యాపారస్థులకు విదేశ వాణిజ్యం మాత్రం లాభిస్తుంది.

## కన్య

[ఉ. 2, 3, 4 పా., హస్త చిత్త 1, 2 పా.]

బంధుమిత్రుల సహాయం లభిస్తుంది. ఆర్థిక విషయాలలో వారితో జాగ్రతగా వ్యవహరించడం అవసరం. ఆకస్మిక నష్టం సంభవించవచ్చు. ఖర్చు పెరుగుతుంది. ఆరోగ్యం విషయంలో శ్రద్ధ చూపవలసి ఉంటుంది. ఉద్రేకానికి లోనవుతారు. వివాహ ప్రయత్నాలకు మీరు తోడ్పడతారు. మొత్తం మీద ఈ వారం డబ్బు గురించి, ఉద్యోగం గురించి ఆందోళన ఉంటుంది. వ్యాపారస్థులకు విదేశ వాణిజ్యం కలిసి వస్తుంది. భాగస్వామ్యం బాగా సాగుతుంది.

## తుల

[చిత్త 3, 4 పా. స్వాతి, విశా 1, 2, 3 పా.]

గ్రహస్థితి అనుకూలంగా ఉంది. ఆశించిన ధనం లభిస్తుంది. ఆకస్మిక ధనలాభంకూడా చేకూరవచ్చు. విజ్ఞానులతో చర్చలు జరుపుతారు. పిల్లల విషయంలో కొంత ఆందోళన కలుగుతుంది. ఓరిమి వహించడం మంచిది. ఇంట్లో అధికమైన సౌఖ్యం లభిస్తుంది. వ్యాపారస్థులకు స్థానిక వాణిజ్యము, భాగస్వామ్యము అధికంగా లాభిస్తాయి.

**మంచి రోజులు:**
**23, 24, 28 తేదీలు**



### శ్రీ పి. వి. రావు కాలధర్మం

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో ఇంతకాలం 'వారఫలాలు' వ్రాస్తూ వచ్చిన సుప్రసిద్ధ జ్యోతిష్కులు శ్రీ పి. వి. రావు కాలధర్మం చెందారని తెలియ జేయడానికి విచారపడుతున్నాము. వారి కుటుంబానికి మా సానుభూతిని తెలియజేస్తున్నాము. ఆయన ఎన్నెన్ని తమిళాంధ్రాంగ్ల పత్రికలలోనో వ్రాసి పేరు మోసిన వారు. సహస్ర మాసోపజీవియై పండిన పండులా రాలిపోయారు.

—ఎడిటర్

## వృశ్చికం [విశా. 4 పా., అనూ. జ్యేష్ఠ.]

గ్రహస్థితి ఆశాజనకంగా ఉంది. సోదరుల పరిస్థితి చక్కబడుతుంది. పిల్లలు ముందుకు వస్తారు. వివాహ ప్రయత్నాలు కొనసాగుతాయి. ప్రయాణ సూచన ఉంది. ఆర్థికస్థితి క్లిష్టంగా ఉంటుంది. కుటుంబ జీవితం ఆనందదాయకంగా ఉండదు. ఉద్యోగంలో ఆశయాలు నెరవేరతాయి. వ్యాపారస్థులకు భాగస్వామ్యం లాభిస్తుంది.

## ధనుస్సు [మూల. పూ. షా., ఉ. షా. 1 పా.]

ఆరోగ్యం విషయంలో జాగ్రత అవసరం. పిల్లల అభివృద్ధి సంతృప్తి కలగజేస్తుంది. డబ్బు సవ్యంగా ఖర్చు చేస్తారు. స్నేహితుల మూలంగా లబ్ధి పొందుతారు. కుటుంబ జీవితం ఆనందదాయకంగా ఉంటుంది. ప్రయాణ సూచన ఉంది. ఉద్యోగంలో యజమాని అనుగ్రహంవల్ల లబ్ధి పొందుతారు. వ్యాపారస్థులకు విశేషమైన లాభాలు చేకూరతాయి.

## మకరం

[ఉ. షా. 2, 3, 4 పా. శ్రవ. ధని 1, 2 పా.]

ఈ మాసమంతటికీ ఇది మంచికాలం. అయితే భార్య, పిల్లలు, ఆరోగ్యం గురించిన ఆందోళన ఉంటుంది. సహచరులలో కొందరి మూలంగా మంచి జరుగుతుంది. వివాహ ప్రయత్నాలు జరుగుతాయి. సోదరులతో విభేదాలు ఏర్పడకుండా జాగ్రత వహించవలసి ఉంది. ప్రయాణ సూచన ఉంది. ఉద్యోగంలో ప్రమోషన్ లభిస్తుంది. వ్యాపారస్థులకు విశేషమైన లాభాలు చేకూరతాయి.

## కుంభం

[ధని 3, 4, పా., శత. పూ. భా. 1, 2, 3 పా.]

శ్రమ పడవలసిన కాలం. శత్రువుల మూలంగా కష్టం కలిగినా పరిస్థితులు ధన సంపాదనకు తోడ్పడవచ్చు. ఇంట్లో చిన్న మార్పు వస్తుంది. పిల్లలలో ఒకరు ముందుకు వస్తారు. ఆరోగ్యం బాగా ఉండదు. ఉద్యోగస్థితి బాగా ఉన్నా పనిఒత్తిడి అధికంగా ఉంటుంది. వ్యాపారస్థులకు భాగస్వామ్యం బాగా లాభిస్తుంది.

## మీనం [పూ. భా. 4 పా., ఉ. భా., రేవతి.]

గ్రహస్థితి బాగా ఉంది. ధనవంతులు ఒకరు సహాయం చేస్తారు. ముఖ్యమైన కార్యం నిర్వహిస్తారు. తల్లిదండ్రులతో విభేదాలు లేకుండా చూడడం అవసరం. వ్యయం చాలా అధికంగా ఉంటుంది. ఉద్యోగంలో ఆశించినదానికన్న అధికమైన లబ్ధి పొందుతారు. వ్యాపారస్థులకు భాగస్వామ్యము, విదేశ వాణిజ్యము విశేషంగా లాభిస్తాయి.





నటరత్నాలు

# ఎస్. వి. ఎల్. నరసింహాచార్యులు

ఆంధ్ర నాటక రంగస్థలంలో ప్రసిద్ధ పౌరాణిక పాత్రలైన హరిశ్చంద్ర, దుర్యోధన పాత్రలను అద్భుతంగా పోషించి ప్రేక్షకుల ఆదరాభిమానాలను అపారంగా అందుకున్న వారిలో ఎస్. వి. ఎల్. నరసింహాచార్యులుగారు ప్రముఖులు.

ఎస్. వి. ఎల్ నరసింహాచార్యులు గారి జన్మ స్థలం విజయవాడ. 1913 అక్టోబరులో జన్మించారు. తండ్రి నండూరి పట్టాభి రామాచార్యులు. తల్లి అలమేలు మంగమ్మ.

చిన్నతనం నుంచీ నరసింహాచారిని పెద్ద చదువులు చదివించాలని తల్లి తండ్రుల అభిలాష. కాని, నరసింహాచారికి నాటక కళాపిపాస ఎక్కువై, ఉన్నత విద్యాభ్యాసానికి అంతరాయం కలిగింది. ఎలాగో స్కూల్ ఫైనల్ వరకూ అతి కష్టం మీద చదవగలిగారు.

ఆయనకు నాటక కళాభ్యాసం తొలి సారిగా చేయించి నాటకరంగ ప్రవేశం కలిగించింది నాట్యాచార్య యడవల్లి సూర్యనారాయణగారు. డి. వి. సుబ్బారావుగారికి ఏకలవ్య శిష్యులు. ఆయన నాటకానుభవం 40 సంవత్సరాలు.

ఆచార్యులుగారు 17 వ సంవత్సరంలోనే హరిశ్చంద్ర పాత్రను ధరించారు. పది సంవత్సరాలు ఏకధాటిని ఆ పాత్రలో రాణించి మంచి కీర్తిని అర్జించుకున్నారు.

ఆ నాడు 'గృహలక్ష్మి' చలన చిత్రంలో అఖండమైన పేరును సంపాదించుకున్న పసుపులేటి కన్నాంబ ఆ తరవాత ఆచార్యులు గారితో చంద్రమతిగా నటించి దీటుగా నిలబడ్డారు. నాటి ప్రేక్షకులు ఆయనను హరిశ్చంద్రాచార్యులుగా పిలిచేవారు.

కాని, హరిశ్చంద్ర పాత్ర ధరించినంత కాలమూ హరిశ్చంద్రుని కష్టాల వలె ఆయనకు కష్ట పరంపరలే ఎదురయ్యాయి. ఎనలేని కష్టాలు పడి చివరకు ఆ పాత్రను ధరించడమే మానుకున్నారు. కాని, తనను అసమాన నటునిగా తీర్చి దిద్దింది ఆ నాటికీ ఈ నాటికీ,హరిశ్చంద్ర పాత్రయేనని చెబుతారు ఆచారిగారు.

ఆ తరవాత ఆయనకు 'చిత్ర నళీయం'లో బాహుకుడు, 'బొబ్బిలి'లో ధర్మారాయుడు, యుగంధరుడు ఇత్యాది పాత్రలు కూడా మంచి కీర్తిని చేకూర్చి పెట్టాయి.

కాని ఆయనకు అన్నం పెట్టి అన్ని విధాలా కీర్తి ప్రతిష్ఠలు ఇచ్చి ధనాన్ని, గౌరవాన్ని చేకూర్చిపెట్టిన పాత్ర దుర్యోధన పాత్రగా చెపుతారు.

ముఖ్యంగా మయసభలో దుర్యోధనుడు. ఈ పాత్ర యడవల్లివారి అద్భుత సృష్టి. ఆయన అనంతరం ఆ పాత్రను ధరించడానికి ఎవరూ సాహసించలేకపోయారు. దుర్యోధన పాత్ర సమానభూయిష్ఠమైనది. దీనికి సంస్కారం అవసరం. అందువల్ల ఆ పాత్ర దరికి చేరలేకపోయే వారు ఇతరులు.

గురువుగారి మరణానంతరం ఆ పాత్రను ఆచార్యులుగారు పరిశీలించి, సాధనచేసి ప్రదర్శించారు. ఈ పాత్రతో ఆంధ్ర నాటక రంగంలో ఉన్నత స్థాయి నటులుగా స్థిరపడిపోయారు.

తరవాత తిరుపతి కవుల నాటకాలలో మాధవపెద్ది నటించే దుర్యోధన పాత్రను కూడా అభ్యసించి ఆపాత్రకు కూడా న్యాయం కలగజేశారు.

మొత్తంమీద మయ సభ అంటే, ఎస్. వి. ఎల్. అనే ఖ్యాతిని సంపాదించారు. 25 సంవత్సరాలపాటు ఏకఛత్రాధిపత్యంగా నాటక రంగస్థలం మీద నటించగలిగారు.

ఆచార్యులు గారిని నాట్యాచార్య, నట రాజశేఖర, అభినవ దుర్యోధన, నట త్రిదశాధీశా, నట సార్వభౌమ బిరుదులతో మహాపండితులూ, కవులూ గౌరవించారు.

ఆయన 'మైరావణ' నాటకంలో మైరావణ పాత్ర ధరించి అభినవ మైరావణ అనే బిరుదును కూడా పొందారు.

ఒక సందర్భంలో ఒక కవి ఈయనను "భువి నుదయింపబోడు నినుబోలు సుయోధన పాత్రధారికన్" అని ఒక పద్యంలో స్తుతించారు.

బెల్లంకొండ, బందా, మాధవపెద్ది, వలివేటి, సి. ఎస్. ఆర్., యడవల్లి, బళ్లారి, అబ్బూరి, స్థానం, అద్దంకి, పులిపాటి, పీసపాటి, షణ్ముఖి మొదలగు మహా నటులూ, మహా గాయకులూ ఆచార్యులు గారికి సహనటులుగా నటించారు.

శ్రీమతి రాజేశ్వరి, పూర్ణిమ, ఐ. ఎస్. రాజకుమారి మొదలైన ఉత్తమ స్త్రీ పాత్రధారిణులతో ఈయన నటించారు.

ఆచార్యులు గారికి సంగీత గురువులు ఓగిరాల జానకిరామయ్య గారు. నాటక రంగస్థలంలో తన నొక పద్యం చదివే వ్యక్తిగా తీర్చిదిద్దిన వారు జానకిరామయ్య గారే నంటారు.

ఆచార్యులు గారి ప్రస్తుత నివాసం తూర్పు గోదావరి జిల్లా కోరుకొండ. ఇప్పటికీ దివ్యంగా నాటకాలు ప్రదర్శిస్తున్న నటశిరోమణి. ★

మిక్కిలినేని [illegible]ధాకృష్ణమ[illegible]

ఆ చక్కని,
పరిశుభ్రమైన తెల్లదనానికి

# ఓ ఓ బి నీలి

ఓ ఓ బి నీలి నీటిలో అతి సులభంగా, పూర్తిగా కరుగుతుంది. తెల్లటి దుస్తులకి సహజమైన మంచులాంటి తెల్లదనాన్నిస్తుంది. మీ చొక్కాలకు, చీరలకు, దుప్పట్లకు మరియు ఇతర బట్టలకు అధికమైన తెల్లదనాన్నివ్వడానికి ఇదే అతి పొదుపైన పద్ధతి. నీలపు మరకలుండవు. పసుపు రంగుగా మారదు.

ఓ ఓ బి నీలి భారతదేశంలోకెల్లా పెద్దదైన, ఆధునికమైన ఫ్యాక్టరీలో పశ్చిమ జర్మనీవారి సహకారంతో తయారుచేయబడుతున్నది.




తయారుచేయువారు:

**అల్ట్రామెరైన్ పిగ్మెంట్స్ లిమిటెడ్** అంబత్తూరు, మద్రాసు-53



UPL 654




ఒళ్లునొప్పి, జలుబులు, తలనొప్పి, బెణుకులు—
వీటిని చప్పున చల్లగా తగ్గించుకోండి. బాధగా
ఉన్నచోటు మీద అమృతాంజనం రాయండి. వెంటనే
గుణం ఇస్తుంది. 75 సంవత్సరాల పైగా ఇంటింటి
దీపమై వెలుగుతోంది అమృతాంజనం! ఎప్పుడూ
ఒక సీసా దగ్గిర ఉంచుకోండి. అమృతాంజనం
ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, చిన్న
డబ్బాలలోనూ కూడా దొరుకుతోంది.
అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది.
నొప్పులను, జలుబులను చప్పున
చల్లగా తగ్గిస్తుంది.
అమృతాంజన్ లిమిటెడ్




AM-5982

# అమృతాంజనం
## చప్పున పోగొడుతుంది!

పుస్తక ప్రియులకు శుభవార్త!

మీ అభిమాన రచయిత్రి
యద్దనపూడి సులోచనారాణి గారి
యువ సీరియల్
**మీనా** మొదటి భాగం - 6-00
రెండవ భాగం - 6-00

ఆంధ్రజ్యోతి పాఠకులను ఉర్రూతలూగించిన
బీనాదేవి గారి
పుణ్యభూమీ! కళ్లుతెరు
(హాంగ్‌మి క్విక్) 7-50
వెలువడినవి!
M.O. పంపిన పోస్టేజి ఉచితం

నవభారత్ బుక్‌హౌస్
ఏలూరురోడ్ * విజయవాడ-2

NAVIN

# చల్లదనాన్ని, శుభ్రతను, మెత్తదనాన్ని – నిమ్మపండు. మీ తల రుద్దుకునేందుకు అటువంటి చల్లదనం, శుభ్రత, మెత్తదనం కలిగించే ఒక క్రొత్త షాంపూ – ల్యూర్ లైమ్ షాంపూ.

ల్యూర్ లైమ్ షాంపూ విశిష్టమైన నిమ్మనూనెతో తయారుచేయబడింది. దీని పుష్కలమైన నురగ మీ జుట్టులో పేరుకొనివున్న మురికి, చుండ్రును కడిగివేస్తుంది.

అంతేకాదు—ల్యూర్ లైమ్ షాంపూతో తల రుద్దుకొంటే మీ జుట్టు పట్టులా మెత్తగా వుంటుంది.

చల్లదనాన్ని, శుభ్రతను, జుట్టు మెత్తదనాన్ని— ల్యూర్ లైమ్ షాంపూ




డిస్ట్రిబ్యూటర్లు, దక్షిణ భారతంలో: టి. టి. కృష్ణమాచారి అండ్ కంపెని



సీరియల్

# అరుణ

—డి. కామేశ్వరి

(క్రిందటి సంచిక తరువాయి)

అర్ధరాత్రి ఎవరో తలుపులు దడదడ తట్టుతున్న ధ్వనికి మెలుకువ వచ్చింది అరుణకి. వీథి గదిలో పడుకున్న మణి లేచి తలుపులు తీసిన చప్పుడు, ఏవో మాటలు వినిపించాయి అరుణకి ఏముంది? మళ్లీ ఎవరో పేషెంట్సు వచ్చి ఉంటారు

ఊర్లో కలరా ఉండడంతో ఓ రెండు విరోచనాలు మామూలుగా వెళ్లినా గాభరాపడిపోయి రాత్రి, పగలు అన్న భేదం లేకుండా వస్తున్నారు కేవలం డయేరియానో, కలరానో తేల్చాలంటే అరుణ తప్పక వెళ్లి చూడవలసి వచ్చేది దానితో అర్ధరాత్రి, అపరాత్రి అనక తిరగవలసి రావడంతో అరుణకి విశ్రాంతి అన్నది చిక్కడంలేదు పది రోజుల నించి సాయంత్రం పొరుగూరు వెళ్లి తొమ్మిది గంటలకి తిరిగి వచ్చింది అప్పుడు స్నానం, భోజనం చేసి పడుకుంది అలిసి మంచి నిద్రలో ఉన్న అరుణకి ఆ అర్ధరాత్రి ఎవరో రావడం చికాకనిపించింది

మణి లోపలికి వచ్చి గది గుమ్మం దగ్గిర నిలబడి అరుణని పిలిచాడు అరుణ కళ్లు విడివడ్డం లేదు బలవంతంగా లేచి పైకి వచ్చింది బయట జీపు ఓ ఇద్దరు మనుష్యులు నిలబడి ఉన్నారు ట్రావెలర్స్ బంగళాలో టూర్ మీద వచ్చిన వాళ్ల ఆఫీసరికి హోటలు భోజనం చెయ్యగానే విరోచనాలు, వాంతులు మొదలెట్టాయట చాలా నీరసపడి వాలిపోయాడట. వెంటనే ఎవరన్నా డాక్టరుంటే తీసుకురావడానికి డ్రైవరు, బంట్రోతు వచ్చారు వెంటనే రావాలంటూ గాభరా పెట్టారు ఇద్దరూ అర్ధరాత్రి—ఊరికి చివర ఉన్న ట్రావెలర్స్ బంగళాకి వెళ్లాలంటే కాస్త సందేహించింది. కాని తప్పదు అవతల ఆఫీసరు చావు బ్రతుకుల్లో ఉన్నాడు ఇంతకీ జీపు ఉంది వాళ్ల మనుష్యులు ఉన్నారు తీసుకెళ్లి, తీసుకొచ్చి దిగబెడతారు భయపడడానికి ఏముంది అని అరుణ మొహం కాస్త చన్నీళ్లతో కడుక్కొని కావలసిన మందులు అవి తీసుకుని వారి వెంట బయలుదేరింది.

బయట గాఢాంధకారం, వర్షం పడకపోయినా మబ్బులు పట్టి, అప్పుడప్పుడు మెరుపులు మెరుస్తున్నాయి ఊరంతా నిద్రపోతూంది కీచురాళ్ల రొద జీపు లేకుండా ఉంటే ఈ రాత్రి అరుణ కదిలేదు కాదు.

ట్రావెలర్స్ బంగళా చేరగానే గుమ్మం ముందు మరో ముగ్గురు మనుష్యులు నిలబడి ఉన్నారు అరుణని చూడగానే వినయంగా దండాలు పెట్టి, "అయ్యగారు లోపల ఉన్నారు. చూడండి" అంటూ లోపలికి దారి తీశారు.

అరుణ గది గుమ్మంలో అడుగుపెట్టి చూసేసరికి, గదిలో ఎవరూ లేరు గది ఖాళీగా ఉంది. మంచం ఖాళీ ఏ బాత్‌రూములోకో వెళ్లాడేమోనని అడగడానికి అరుణ వెనక్కి చూసింది. అంతే! అరుణ నిశ్చేష్టురాలైంది గుమ్మం దగ్గిర కనపడ్డ ముగ్గురూ లోపలికి వచ్చి తలుపు గడియ పెట్టారు వెంటనే ఒకడు దీపం ఆర్పేశాడు. అరుణ మీది మీదికి ఒకడు రావడం ఆరంభించాడు అరుణ స్థాణువై పోయింది. అసలు జరుగుతున్నది ఏమిటో అర్థం చేసుకోవడానికి ఒక్క నిమిషం పట్టింది ఎదురుచూడని ఈ హఠాత్పరిణామానికి నోట మాట రానంతగా దిమ్మెర పోయింది వాళ్లు ముగ్గురూ ఏం చెయ్యబోయేది తలుచుకోగానే అరుణ ప్రాణాలు పైకి ఎగిరిపోయాయి కెవ్వున కేక పెట్టింది "ఏయ్ ఎవరు ఎవరు, మీ రెవరు? ఎందుకు నన్నిక్కడికి తీసుకొచ్చారు? ఎవరు వీారు?" వణుకుతున్న గొంతుతో లేని ధైర్యం తెచ్చుకుంటూ అడిగింది

వాళ్లు జవాబీయలేదు విలన్ నవ్వులాంటి నవ్వు నవ్వారు. ఆ చీకట్లోనే ఒకడు తన మీదికి రావడం



నీవు గేదెల్ని బాంకుకు తేనవసరంలేదు, మేమే వచ్చి చూస్తామని చెప్పలేదూ?

గుర్తుపట్టి గజగజ వణికిపోయింది అరుణ. అప్పటి అరుణకి అసలు సంగతి అర్థం అయింది. ఈ అర్ధరాత్రి ఈ ఊరు చివర త నెలాంటి ఆపదలో చిక్కుకుంది అర్థం అయింది. ఈ చోట తన కింక దిక్కెవరు? ఎం మూర్ఖురాలు! ఒక్క పిసరు ఆలోచన లేకుం అర్ధరాత్రి కొత్తవాళ్ల వెంట ఎందుకు రావాలి తను అసలు వీళ్లెవరు? తను వాళ్లనేం చేసింది? తనని ఇల తీసుకొచ్చి ఇంత అత్యాచారానికి ఎందుకు ఒడిగట్టారు. అరుణకి భయంతో ఏం చెయ్యాలో తోచడం లేదు ఆ చీకట్లో ఆ మనిషి తడుముకుంటూ అరుణ చేతుల గట్టిగా పట్టుకున్నాడు. అరుణ గావుకేక పెట్టింది "వదులు, వదులు. నీ వెవరు అసలు? మీ రెవరు.. ఏమిటి మీ ఉద్దేశం? వదులుతారా, వదలరా ... పెనుగులాడి అరుణ గదిలో పిచ్చిగా అరుస్తూ ఇటు అటు పరుగెత్తడం ప్రారంభించింది. ఎటువెళ్లినా ఎవడో ఒకడు పట్టుకుని లాగుతున్నాడు.

"మా ఉద్దేశమా! తెలుస్తుంది. తొందరపడకు పిల్లా!" అన్నా డొకడు నవ్వుతూ.

"ఇదిగో, నే నెవరనుకుంటున్నారో ... మిమ్మల్ని వదిలేస్తాననుకుంటున్నారో ఏమో? పోలీసులని పిలుస్తా జైలులో తోయిస్తా. జాగ్రత్త. వదలండి నన్ను.' బింకంగా బెదిరించబోయింది అరుణ పెనుగులాడుతూ.

"నిన్ను ముందు మేం వదలం. తరవాత కావలిస్తే మమ్మల్ని నివు వదలద్దులే." వికటంగా నవ్వాడు, అరుణ చేయి పట్టుకుని మంచంకేసి లాగుతూ ఒకడు. అరుణకి ఆ క్షణంలో త నెంత నిస్సహాయ స్థితిలో ఉందో అర్థం అయిపోయింది. తను అరిచినా, గీపెట్టినా వీళ్ల చేతు ల్లోంచి రక్షించేవారు ఎవరూ లేరని అర్థం అయిపో యింది. అయిపోయింది తన పని ... తనింక ఏం చేయ గలదు? ఒకడు కాదు, ముగ్గురు! వాళ్లనించి తప్పించుకో లేదు. వాళ్లు తనని జీవచ్ఛవం చేసిగాని వదలరు. తను ఇలా భ్రష్టురాలవడానికా ఎంతమంది వారించినా ఈ ఊరొచ్చింది! భగవంతుడా! అరుణ పెనుగులాడింది. గిల్లింది. రక్కింది. పెద్ద పెద్ద కేకలు పెడుతూ పెనుగులాడింది. ఆఖరి ఆయుధంగా వారిని అందిన చోటల్లా కరిచింది. దానితో ఒక్క క్షణం వదిలినా, మరింత కసితో అరుణని మంచం మీదికి ఒక్క త్రోపు తోసి మీద పడ్డాడు వాడు. అరుణకి కళ్లు బైర్లు కమ్మాయి. ఊపిరి ఆడనట్టు గిలగిలలాడింది. ఉక్కిరి బిక్కిరి అయింది. తరవాత శరీరం తేలికయిపోతున్నట్టు, ఏ లోకంలోకో వెళ్లిపోతున్నట్టు అనిపించింది. అరుణకి తెలివి తప్పింది.

అరుణ మళ్లీ కళ్లు విప్పేసరికి లైటు వెలుగు తూంది. తన మొహం మీదికి వంగి ఎవడో యువకుడు ఆదుర్దాగా చూస్తున్నాడు, చేతిలో నీళ్ల గ్లాసు పట్టుకుని. అరుణ వెర్రిదానిలా చూసింది. అతను చేతిలో గ్లాసుతో నీళ్లు మరికాసిని అరుణ మొహం మీద చల్లి, ఆమె చీర కొంగుతో మొహం అద్దాడు. పెదాలకి గ్లాసు ఆనించి కొంచెం కొంచెంగా నీళ్లు పోశాడు అరుణ అలా చూస్తూనే గుటకలు వేసింది.

"మెలుకువ తెచ్చుకోండి తెలివి వచ్చిందా? ఇటు చూడండి భయంలేదు. వాళ్లు పారిపోయారు. మీకేం భయంలేదు మెలుకువ తెచ్చుకోండి." అతను నెమ్మదిగా అరుణని చూస్తూ అన్నాడు.

## జరిగిన కథ

అరుణ వైద్యం చదివింది. వైద్య సౌకర్యాలు లేని గ్రామాలలో ప్రాక్టీసు పెట్టాలని సంకల్పించింది. తల్లి తండ్రి, అన్న ఇష్టపడలేదు. వైద్యసౌకర్యం లేక స్నేహితురాలు జానకి చనిపోవడంతో సంకల్పం బలపడింది. అరుణ అందుకోసం ప్రేమించి పెళ్ళాడగోరిన వేణుగోపాల్‌ను కూడా కాదన్నది. జానకి అత్తవారి ఊరిలోనే ప్రాక్టీసు చేయదలచి, జానకి భర్తకు ఉత్తరం వ్రాసింది. అన్న కృష్ణమూర్తితో ఆ ఊరు చూడడానికి వెళ్లింది. జానకి భర్త సుబ్బారావు చాలా ఆదరంగా చూశాడు. ఆ ఊళ్ళో ఖాళీగా ఉన్న జమీందారు భవనంలో ఆస్పత్రి పెట్టే ఆలోచన జరిగింది. జమీందారిణి సమ్మతి లభించింది. అరుణ ఆస్పత్రికి ఘనంగా ప్రారంభోత్సవం జరిగింది. ఆ ఊరు కరణం కొడుక్కి ఆపరేషన్ చేసి ప్రాణం నిలబెట్టి పేరు తెచ్చుకొంది అరుణ. దానితో ప్రాక్టీసు పెరిగింది. సమస్యలూ ఉత్పన్నమయ్యాయి. ప్రెసిడెంటు చిక్కులో పడి సహాయం కోరాడు విధవ కూతురు కడుపు పోగొట్టమని. అరుణ నిరాకరించింది. ప్రెసిడెంటు బెదిరించాడు. ప్రెసిడెంటు కూతురు ప్రేమించిన వీరణ్ణి పెళ్ళాడడానికి సాయం చేసింది. ప్రెసిడెంటు పగబట్టాడు. పూజారి కోడలు అరుణకు తన గాథ నివేదించింది. చివరికి ఆమె ఆత్మహత్య చేసుకొంది. ఊళ్ళో కలరా వ్యాపిస్తే అరుణ సేవ చేసింది.

అరుణకి ఆ పరిసరాలు, అసలు తనక్కడికి ఎందుకు వచ్చిందో ఏమిటో గుర్తు చేసుకోవడానికి రెండు మూడు నిమిషాలు పట్టింది గుర్తు వచ్చాక ఒక్క ఉదుటున లేచి కూర్చుంది భయంతో "వాళ్ళు వాళ్లేరి? మీ రెవరు? ఇక్కడికి ఎలావచ్చారు? వాళ్ళు వాళ్ళు నన్ను నన్ను ఏం చేశారు?" చిన్న పిల్లలా బావురుమంది అరుణ, ఒక్కసారిగా అంతా గుర్తు రాగానే

"లేదు, లేదు ఏం జరగలేదు ఏం భయంలేదు మీ రూరుకోండి సమయానికి నే నొచ్చాను వాళ్ల పథకం పారలేదు, పారిపోయారు మీకేం ఫరవాలేదు ఏం అనిష్టం జరగలేదు మీరు ఆదుర్దా పడకండి కొంచెంసేపు అలా పడుకోండి చాలా షాక్ తిన్నారు. మీరు అంతకంటె ఏం కాలేదు" తుఫానులో చిగురుటాకులా వణికి పోతున్న అరుణని బుజాలు పట్టి అతను నెమ్మదిగా పడుకోబెట్టాడు కొద్దిసేపటి క్రిందట జరిగిన ఆ భయంకర దృశ్యం కళ్లముందు కదులుతూంటే అరుణ మొహం రక్తం లేనట్లు పాలిపోయింది పెదాలు తడారిపోయాయి శరీరం అంతా గజగజ వణుకుతూంది. నోట మాట రావడం లేదు. కళ్లంట నీరు కారిపోతూంది.

ఆతను అరుణకి ధైర్యం చెబుతూ, నెమ్మదిగా భయం పోగొట్ట సాగాడు మొహం మరో మాటు రుమాలు నీళ్లలో తడిపి తుడిచాడు. ఆమె చేతులు వణకకుండా పట్టుకున్నాడు కాస్త వేడి వేడి టీ, కాఫీ దొరికితే బాగుండు ననిపించినా, ఆచుట్టుపక్కల ఏమి దొరకవు గనుక మరికాసిని చన్నీళ్లే త్రాగించాడు.

ఓ పదహేను నిమిషాల తరవాత కాస్త కాస్త స్పృహలోకి వచ్చింది అరుణ. పూర్తిగా తెలివి వచ్చింది అతను చెబుతున్న ధైర్య వచనాలకి భయం కాస్త కాస్త తగ్గి ఆమె శరీరం వణకడం తగ్గింది. లేచి కూర్చో గలిగింది స్థిరంగా. "మీరు ఈవేళకి ఇలా రావడం ... నిజంగా దేముడే పంపినట్లున్నారు . ." హీనస్వరంతో అంది అరుణ.

"నిజమే అలాగే అనుకోవాలి మరి" అన్నాడతను. అతని పేరు రమేష్ చౌదరి చౌదరిగా రబ్బాయి వారం రోజుల క్రిందటే పట్నం నించి వచ్చాడట చౌదరి గారు బాగా డబ్బున్న భూస్వామి. రాత్రి మొదటి ఆట సినిమాకి వెళ్లి టౌనునించి తిరిగి వస్తూంటే సగం దూరం వచ్చాక సైకిలు టైరు పంక్చరు అయిందిట మళ్లీ వెనక్కి వెళ్లి టైరు పంక్చరు అది వేయించుకుని రావడంతో ఆలస్యం అయిపోయింది ఇక్కడికి వచ్చేసరికి ఓ స్త్రీ కేకలు బంగళాలోంచి వినిపించి చటుక్కున సైకిలు దిగి బాటరీలైటు వేసి చూశాడు చీకట్లో ఆ కేకలు బంగాళాలోంచే అని దృఢ పరుచుకుని అటు పక్కకి గబగబ వెళ్లాడు తలుపులు తట్టాడు నిశ్శబ్దం అయిపోయింది తలుపులు తట్టుతూ ఎంత కేకలు వేసినా తీయకపోవడంతో, లోపల ఏదో అత్యాచారం జరుగుతూందని అతనికి అర్థమయి కిటికీ గాజు తలుపులు బద్దలు కొట్టి గదిలో ప్రవేశిస్తూంటే ఆ ముగ్గురూ రెండో వైపు తలుపులు తీసుకుని పారిపోయారు అతను బాటరీ లైటు వేసి వాళ్లని వెంబడించినా, ఆ చీకట్లో ముగ్గురూ తలో మూలకి ఆ తుప్పల్లోకి పారిపోయారు. వెంటనే లోపలి కొచ్చి లైటు వేసి చూసేసరికి అరుణ స్మృతిహీనురాలై మంచం మీద పడి ఉంది అరుణ పడి ఉన్న తీరు, తను వచ్చే క్షణం ముందే కేకలు ఆగిపోవడం దాన్నిబట్టి ఇంకా ఏ అత్యాచారం జరగక ముందే తను వచ్చినట్టు తెలుసుకున్నాడు.

"నిజంగా ఏది జరిగినా మన మంచికే అంటారు అలా సైకిలు పంక్చరవకపోతే పదకొండు గంటలకల్లా ఇంటికి వెళ్లిపోయి ఉండేవాణ్ణి ఇలా ఒంటిగంటకి రావలసిన అవసరం కలగచేయడం నిజంగా ఆ భగవంతుడు మీపట్ల ఉండి, నన్ను ఇలా పంపి ఉంటాడు లేకపోతే ఈ అర్ధరాత్రి, ఇటుపక్క ఎవరూ వచ్చే అవకాశమే లేదు"

"చెప్పకండి మీరే రాకపోయి ఉంటే . తలుచుకుంటే నాకు వణుకు వస్తూంది నిజంగా మిమ్మల్ని ఏమని అభినందించాలో, ఎలా కృతజ్ఞతలు చెప్పాలో, ఏం చేసి మీ ఋణం తీర్చుకోవాలో"

"బాగుంది. ఇందులో అభినందించడాని కేముందండి? కాస్తో కూస్తో మానవత్వం ఉన్నవా డెవడైనా

ఆ సమయంలో చూస్తూ ఊరుకోడు ఎటొచ్చీ ఆ క్షణముకి నేనిక్కడికి రావడం ఆక్సిడెంటల్‌గా అయి అదే మీకు రక్షణ ఇచ్చింది. అంతకంటె నేను మీకు చేసిందేంలేదు. అసలు మీరు ఈ సమయంలో ఎందుకొచ్చా ఇక్కడికి? మీరు ఈ ఊర్లో డాక్టరుగా ఉన్నా విన్నాను దూరంనించి మిమ్మల్ని ఒకసారి ఎవ చూపిస్తే చూశాను కనక మిమ్మల్ని చూడగానే పట్టాను ఏదన్నా అర్జెంట్ కేసని పిలిచారా ఎవరన్నా మీ బాగ్‌చూసి అదే అనుకున్నాను."

అరుణ తల ఊపింది "ఈ ట్రావెలర్స్ బంగళా ఎవరో ఆఫీసరుకి కలరా వచ్చిందని ఎవరో వ జీపులో వచ్చాను తీరా చూస్తే ఎవరూ లేరు. వాళ వన్నిన వల ఇది ఇంతకీ ఆ జీపు ఉందా మీరు వ సరికి?"

"జీపా! లేదే! అసలు నే వొచ్చేసరికే లేదు." వి యంగా అన్నాడు. "ఆ జీపు నంబరు చూశార గుర్తుందా?" ఆదుర్దాగా అడిగాడు

"లేదు, చూడలేదు. చీకట్లో నంబరు అది చూ లని అప్పుడు నా కెందుకు తట్టుతుంది?"

"పోనీ, ఆ మనుష్యులని మరోసారి చూస్తే గురు పట్ట గలరా? అసలు వాళ్ళు ఇలాంటి పనికి ఎందుకు పూనుకున్నా రంటారు?"

"ఏమిటో నాకేం అర్థం కావడం లేదు వాళ్ల నే నేం ద్రోహం చేశానని నామీద ఇలా కత్తి కట్టారు అసలు వాళ్లని చూసిన గుర్తయినా లేదు నాకు నే వచ్చేసరికి గుమ్మం ముందు క్రీనీడలో ఉన్నారు గదిలోకి రాగానే లైటు ఆర్పేశారు. వాళ్లని అసల సరిగా చూడనేలేదు నేను" ముందునించి జరిగిందంతా వివరించింది అరుణ

"ఊఁ తరవాత ఆలోచిద్దాం ఆ సంగతి. ముందు ఇంటికి వెడదాం, పదండి. నడవగలరా? లేకపోతే ఎలాగూ రెండు గంట లయింది, ఇక్కడే పడుకోండి. నేను సాయం కూర్చుంటాను ప్రొద్దుట వెళ్లి బండి తెస్తాను"

అరుణ గాభరాగా వారించింది "వద్దు, వద్దు ఇక్కడా? ఒక్క క్షణం ఉండను పదండి, వెళ్లిపోదాం. నడవగలను, పదండి."

నడవగలను అంది గాని, అరుణ లేచి నించోగానే కాళ్లు భూమిమీద నిలవలేదు ఒక్క గంటలో ఏ టైఫాయిడ్ జ్వరమో వచ్చి లంఖణాలు చేసినంత నీరసంగా ఎలా అయిపోయిందో అరుణకే ఆశ్చర్యం అనిపించింది ఆ షాక్ నించి నెర్వస్ వీక్‌నెస్ ఆ అదటు తగ్గితే కాని మామూలు కాలేదు తను. తను ఎంతో ధైర్య సాహసాలు ఉన్నదని ఇన్నాళ్లుగా అనుకునేది. అలాంటిది తనే ఎలా అయిపోయింది! ఎంత ప్రమాదంనించి తప్పించుకుంది! నించుని రెండు అడుగులు వేయగానే అరుణ నిలబడలేక మళ్లీ మంచం మీద కూలబడింది.

"మీరు చాలా నెర్వస్ అవుతున్నారు చాలా షాక్ తిన్నారు స్తిమితపడండి కొంచెంసేపుండి వెడదాం లేకపోతే నా సైకిలుంది. మీ కభ్యంతరం లేకపోతే .." సందేహిస్తూ ప్రశ్నార్థకంగా చూశాడు

"అభ్జెక్షన్ ఏముంది? పదండి, వెడదాం ఇక్కడ మరొక క్షణం ఉంటే ఇంకేం జరుగుతుందోనని భయం వేస్తూంది. ఇంటి కెడితే గాని ఈ భయం పోదు నాకు"



నిలుచున్న అరుణకి చేయి అందించి, మరో చేత్తో బాగ్ తీసుకుని నడిపించుకు వెళ్ళాడు రమేష్ సైకిలు దగ్గిరికి

"జాగ్రత్తగా పట్టుకు కూర్చోగలరా? వణుకు వస్తే చెప్పండి. నెమ్మదిగా తీసుకెడతాను లెండి" అరుణని కూర్చోబెట్టి సైకిలు తొక్కడం ఆరంభించాడు రమేష్.

ఇంటి దగ్గిర మణి వీధి అరుగుమీదే అరుణకోసం చూస్తూ కునికిపాట్లు పడుతున్నాడు. జీపులో వెళ్లిన అరుణ, ఓ అపరిచితుడి వెంట సైకిలెక్కి రావడం చూసి ఆశ్చర్యపోయాడు. ఎదురెళ్లి బాగ్ అందుకుని ఆశ్చర్యంగా ప్రశ్నలు వేయబోతూంటే రమేష్ వారించాడు. "అమ్మగారికి ఒంట్లో బాగులేదు. వెంటనే వేడి వేడి కాఫీ కలిపి పట్రా, తొందరగా." అతనే పురమాయించాడు.

అరుణ అతని సాయంతో ముందు గదిలోకి వెళ్లి అక్కడున్న సోఫాలో వాలిపోయింది. మణి కాఫీ కలిపి రెండు కప్పులలో తీసుకొచ్చాడు బాగ్‌లోంచి నెర్వస్‌నెస్ తగ్గడానికి ఓ మాత్ర తీసి వేడి వేడి కాఫీతో వేసుకుంది అరుణ. రెండు నిమిషాలలో కాస్త ప్రాణం వచ్చినట్లు అనిపించింది లేచి కూర్చుంది.

"మీకు చాలా ఆలస్యం అయిపోయింది. మీకు చాలా శ్రమ అయింది నావల్ల. ఇంక ఫరవాలేదు నాకు. మీరు వెళ్ళండి. రెండు దాటిపోయింది. పోనీ, ఇక్కడ పడుకుంటారా? మంచం వేయిస్తాను. ఇంత రాత్రి ఏం వెడతారు?" అనడిగింది అరుణ.

"అబ్బే, అక్కరలేదు. ఇంటికి వెళ్ళిపోతాను. ఉదయం వస్తాను. ఈ విషయం గురించి ఏం చెయ్యాలో ఆలోచిద్దాం. మరి నే వెడతాను. మీ రింక ఈ సంగతి ఏమి ఆలోచించకండి. నిద్రమాత్ర వేసుకుని నిద్రపొండి."

"థాంక్స్! 'థాంక్స్' అన్న మాట చాలా చిన్నది. మీరు నాకు చేసిన మహోపకారానికి కృతజ్ఞత చెప్పే మాట లేదు." చేతులు జోడించి నమస్కారం చేస్తూ అంది అరుణ. "దయచేసి రేపు వస్తారు గదూ?"

రమేష్ వెళ్ళబోతూంటే మణి వెంట సుబ్బారావు హడావిడిగా వచ్చాడు, "ఏం జరిగిందండీ?" అంటూ. మణి ఎప్పు డెళ్ళి చెప్పి పిలుచుకు వచ్చాడో అరుణ చూడనేలేదు.

"అరే, ఈ అర్ధరాత్రి మిమ్మల్ని లేపుకొచ్చాడా మణి?" నొచ్చుకుంటూ అంది అరుణ.

"నా కేమిటో గాభరా వేసిందండి. మీ రెప్పుడూ ఇలా లేరు, ఉన్నపాటున మీ కేం జబ్బు చేసిందో నాకర్థం కాలేదు. జీపులో వెళ్ళి సైకిలు మీద ఈయన వెంట ఎందు కొచ్చారో ఏమిటో అంతా గాభరా అనిపించి, వెళ్ళి పిలిచాను." మణి వివరించాడు.

"ఫరవాలేదు లెండి, ఓ పూట నిద్ర లేకపోతే. అస లింతకీ ఏం జరిగింది?" సుబ్బారావు ఆదుర్దాగా అడుగుతూ, రమేష్ ఎవరన్నట్టు ఆశ్చర్యంగా చూశాడు.

రమేష్ వెళ్ళబోతున్న వాడల్లా ఆగి, మళ్ళీ వచ్చి కూర్చుని అరుణ తరఫున జరిగిన దంతా వివరించాడు. సుబ్బారావు మొహంలో కలవరపాటు కనిపించింది.

"నే ననుకుంటూనే ఉన్నాను, ఏదో జరుగుతుందని. ఆ ప్రెసిడెంట్ అంత తేలిగ్గా వదలడని నేను చెప్పలేదా మీకు? తప్పకుండా ఇది వాడి పనే." విన్న వెంటనే అన్నాడు సుబ్బారావు.

ప్రెసిడెంట్ పేరు వినగానే అరుణ దిగ్గున తల ఎత్తింది. అంతవరకు ఆ ఆలోచనే రాలేదు అరుణకి. జరిగింది ఇప్పటికి అర్థమయింది. "ఇది అతని పనే అంటారా?" సందేహిస్తూ నెమ్మదిగా అడిగింది.

"ఇంకా మీకు సందేహమా? ఇంత ధైర్యం చెయ్యడానికి ఇంకెవరికి ఈ ఊళ్ళో దమ్ము లున్నాయి? అయినా, మీరు ఎవరి కే అపకారం చేశారని కక్ష కడతారు?"

"అవును. నామీద కసి తీర్చుకోవడానికి ఈ మార్గం అవలంబించాడన్న మాట. మరి... మరి... ఆ జీపు అది ఎవరిది? ఆ ముగ్గురు ఎవరై ఉంటారు?"

"జీపు కేముంది! ఏ బి. డి. ఓ. దో! లేక పక్క ఊరిలో ఓ కంట్రాక్ట రున్నాడు అతడి కో జీపుంది. వాడు, వీడు కావలసిన వాళ్ళే, వాడితో ఏదో పనుందని, ఓసారి జీపు కావా లని ఉంటాడు. జీపు అది ఉంటే నిజంగానే ఆఫీసరని మీరు నమ్మి వస్తారని పకడ్బందీగా అంతా ఏర్పాటు చేశాడు. డబ్బిచ్చి ఎవరో రౌడీలని కుదిర్చి ఉంటాడు. ఎక్కడా తన పేరు పైకి రాకుండా, వెనక నుండి అంతా జరిపించాడు."

"బాప్‌రే! నిజంగా ఇంత కక్ష కడతాడని నే ననుకోలేదు. నిజంగా ఎంత ప్రమాదం గడిచింది! ఈయన గనక రాకుండా ఉంటే నేను ఏమయ్యేదాన్నో!" అరుణ గుండెల మీద చెయ్యి వేసుకుంది.

"మీకు...మీకే కాదు, ఏ స్త్రీకయినా ఇంతకంటే శిక్ష మరోటి ఉండదు. అందుకే మిమ్మల్ని ఈ శిక్షకి గురిచేసి ఆనందించుదా మనుకున్నాడు. కాని, వాడి పాపపు టాలోచన విధి శక్తి ముందు తేలిపోయింది."

రమేష్‌కి ప్రెసిడెంట్ గొడవ అది అర్థం కాక ఆశ్చర్యంగా వింటున్నాడు, ఇద్దరూ మాట్లాడుకుంటూంటే. అది చూసి అరుణ క్లుప్తంగా అంతకు ముందు ప్రెసిడెంట్‌కి తన మీద కోపం రావడానికి కారణం అది వివరించింది.

"నిజంగా ఈ పంచాయతీ ప్రెసిడెంట్లు ఈ గ్రామాలని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతున్నారు. వాళ్ళకి బొత్తిగా అదుపు లేకుండా ఉంది. ఇలాంటి వాళ్ళని మనం వదలకూడదు. పోలీసులకి రిపోర్టు ఇద్దాం." ఆవేశంగా అన్నాడు రమేష్.

"అవును. ఊరుకోను నేను. వాడి పని ఎలా పట్టడమో నాకూ తెలుసు." క్రోధంగా అంది అరుణ.

సుబ్బారావు లాభంలేదని తల అడ్డంగా తిప్పేశాడు. "ఏమని రిపోర్టు ఇస్తారు పోలీసులకి? ఇదంతా ప్రెసిడెంట్ చేయించినట్టు చెప్పడానికి మీకేం ఆధారముంది? కనీసం జీపు నంబరయినా తెలియదు. ఆ ముగ్గురిని గుర్తయినా పట్టలేరు మీరు. ఏ ఆధారం ఉంది మీకు — రెడ్డి దోషి అని చెప్పడానికి?"

అరుణ, రమేష్ మొహాలు చూసుకున్నారు. "ప్చ్! లాభంలేదు!" అన్నాడు నిరాశగా రమేష్.

"మనం వాడిని ఏం చెయ్యలేం. సరే, ఈ గండం ఎలాగో భగవంతుడి దయవల్ల గడిచింది. డాక్టరుగారూ! మీ రెప్పుడూ రాత్రి పైకి వెళ్ళవద్దు. సీరియస్ కేసన్నా, ఎంతో బాగా తెలిసిన వాళ్ళయితే తప్ప ఇల్లు కదలవద్దు. అదయినా వెంట ఎవరినో తీసుకెళ్ళండి. రాత్రిళ్ళు ఎవరు పిలిచినా, పప్పింది ఎవరో చూడకుండా తలుపులు తీయకండి. ఏమో, వాడి ప్రయత్నం విఫలమైందని, వాడి పగ పల్లారక ఇంకే విధంగానైనా కసి తీర్చుకోవడానికి చూడచ్చు. మీ జాగ్రత్తలో మీ రుండడం మంచిది." సుబ్బారావు అరుణకి బోధి

వాడు.

అరుణ తల ఊపింది. "మళ్ళీనా? మళ్ళీ ఇలాం పొరపాటు చేస్తానా?" జీవం లేని నవ్వు నవ్వు అంది.

సుబ్బారావు, రమేష్ లేచి నిలుచున్నారు వెళ్ళడాని

"అన్నట్టు మిమ్మల్ని నేను ఎప్పుడూ చూడలేదే, ఈ ఊరేనా మీది?" సుబ్బారావు అడిగాడు.

"ఆ చౌదరిగారు మా నాన్నగారు. నేను ఏదో వ నాలుగు రోజు లుండి పోవడం మినహా, ఎప్పుడూ చదు కునే రోజుల నించి ఇక్కడ లేను" అన్నాడు.

"అదే, ఈ ఊ రయితే నాకు తెలియని వాళ్ ఎవ రున్నారు? నిజంగా మీ రిలా రావడం ఆమెని రక్షిం డానికే ఆ దేవుడు పంపిన ట్లున్నాడు." సుబ్బార కూడా కృతజ్ఞతా పూర్వకంగా అన్నాడు.

"నిజంగా దేవుడే నన్ను పంపి ఆమెని రక్షించివే అలాగే ఆ దేవుడే ఉంటే ఆ రెడ్డిగారికి శిక్ష విధించాలి ఏమంటారు?" నవ్వాడు రమేష్.

ఇంకా రమేష్ మాటలు నోట్లో ఉండగానే, ఇద్దర ముగ్గురు మనుష్యులు లాంతరు పుచ్చుకుని మెట్లెక్కి వచ్చారు. "అమ్మగోరూ, డాక్టరమ్మగారూ! బేగి రావాలి మా బాబుకి ఒకటే వాంతులు, ఇరోచనాలు. దబ్బు మిమ్మల్ని తీసుకు రమ్మని అమ్మగారు పంపారు" అన్నార హడావిడిగా.

"ఎవరు మీరు? ఏ అయ్యగారికి విరోచనాలు!" అరుణ అడిగింది.

"ప్రెసిడెంటు గోరికండి!" అయ్యగారంటే ప్రెసి డెంట్ గారన్న విషయం తెలియదా అన్నట్టు గట్టిగా దబాయింపుగా అన్నా డొకడు. "అర్ధరాత్రి కాడనిం ఇరోచనాలు, వాంతులు అవుతున్నాయండి. తమర దబ్బున రావాలి."

అరుణ, రమేష్, సుబ్బారావు—ముగ్గురు మొహాల చూసుకున్నారు. రమేష్ మొహాన చిన్న చిరునవ్వు తొం చూసింది. "దేవు డున్నాడు. ఒప్పుకుంటున్నాను" అన్నాడు అర్థవంతంగా నవ్వుతూ.



"డాక్టరమ్మగారికి ఒంట్లో బాగులేదు. ఆవిడ ఇప్పుడు రారు." రమేష్ ఆలోచిస్తూ నిలుచున్న అరుణ తరఫున తనే జవాబిచ్చాడు. "చావనీయండి. వాడికి శాస్తి జరగాలి. మీ రెంతమాత్రం వెళ్లకండి." ఇంగ్లీషులో అరుణతో అన్నాడు.

"అవును. వెళ్లకండి మీరు. వాడి తెగులు అణుగుతుంది. వెధవని ఎవరొచ్చి రక్షిస్తారో చూద్దాం. వాడి పాపం వాడినే కొట్టింది. చస్తాడు. చావనీండి." సుబ్బారావు కసిగా, ద్వేషంగా అన్నాడు.

"మీరు వెళ్లండి, ఆవిడ రారు. రారని చెప్పండి." రమేష్ ఆ మనుష్యులతో అన్నాడు మళ్లీ. వాళ్లు ముగ్గురూ ప్రెసిడెంట్ అంతవాడు రమ్మంటే రారని చెపుతున్నారేమిటి అని వింతగా చూశారు.

అరుణ ఆలోచన తెగినట్టు తలఎత్తి రమేష్, సుబ్బారావు వంక చూసింది. "కాదు, వెడతాను. వాడికి ... మనిషి అయి మానవత్వం అన్న మాటకి అర్థం తెలియని ఆ పశువుకి మానవత్వం అంటే ఏమిటో తెలియ చేస్తాను. నా శత్రువు పట్ల కూడా నా వృత్తి ధర్మం మరవలేను." స్థిరంగా అంది అరుణ.

"ప్లీజ్! వద్దు. మీ రింకా సరిగాలేరు. అయినా, మీ వెర్రిగాకపోతే ఇలాంటి మనుష్యులలో పరివర్తన మీ రనుకున్నంత తొందరగా రాదు." రమేష్ వారించాడు.

"ఎక్స్‌క్యూజ్ మీ! నే వెడతాను. వెళ్లాలి. రోగి ఎవరైనా, రోగం నయం చేయడం నా ధర్మం. వ్యక్తిగత కక్షలు ఎలా ఉన్నా, నా దగ్గిరకి రోగిగా వచ్చిన వాని కాదనలేను నేను. అలా అయితే ఇక్కడికి రావడం అనవసరం నేను." నెమ్మదిగా అంది అరుణ, బాగ్ చేతిలో పట్టుకుంటూ.

సుబ్బారావు, రమేష్—ఇద్దరూ ఏమనలేక పోయారు. ఇద్దరూ మొహాలు చూసుకున్నారు. ఆ చూపుల్లో అరుణ పట్ల గౌరవ ప్రపత్తులు ద్యోతకం అయ్యాయి. చూపులతోనే ఆమె ఉన్నతాదర్శాలని అభినందించారు.

"పదండి, మీ వెనకాల మేమూ వస్తాం. మళ్లీ ఇందులో ఏం తిరకాసు ఉందో? నమ్మలేం ఆ మనిషిని." ముందు లాంతరు చూపిస్తూ వెడుతున్న వాళ్లకి వినిపించకుండా నెమ్మదిగా అన్నాడు సుబ్బారావు.

"అవును. ఊరి పెద్ద గారికి జబ్బుచేస్తే చూసినట్టూ ఉంటుంది, మీకు సాయంగా ఉన్నట్టూ ఉంటుంది. ఇంతకీ ఆ మహాత్ముని ఒకసారి కళ్లారా దర్శిస్తేగాని, ఇంటికెళ్లినా నాకు నిద్ర పట్టదు." చమత్కారంగా అన్నాడు రమేష్.

అరుణ వెళ్లేసరికే రెడ్డిగారి పరిస్థితి చాలా ప్రమాదంగా ఉంది. అరుణని చూస్తూనే ఏడుస్తూ, ఆయన భార్య గోలపెడుతూ జరిగిందంతా చెప్పుకొచ్చింది.

రెడ్డిగారికి వాంతులు, విరోచనాలు అర్ధరాత్రే ప్రారంభించినట్లుంది. మామూలుగా లేచి పెరట్లోకి వెళ్లాడనుకుంది రెడ్డి భార్య నిద్దర్లో. పెరట్లోకి వెళ్లిన ప్రెసిడెంట్, మళ్లీ లోపలికి రాకుండానే వెంట వెంటనే నాలుగైదు వాంతులు, విరోచనాలు అయి ఉంటాయి. పాయిఖానా దాకా ఆ గుర్తులన్నీ ఉన్నాయి. వరండాదాకా వచ్చి కాళ్లు, చేతులు తేలిపోతూంటే అక్కడ పడిపోయి ఉంటాడు. నోట మాట రాలేదో, ఒక వేళ పిలిచినా నిద్దర్లో ఉన్న ఎవరికీ వినిపించలేదో తెలియదు. ఆ వరండాలో, పంచెలోనే మళ్లీ విరోచనాలయ్యాయి. వాంతుల మధ్య పడి ఉన్నారు రెడ్డిగారు. తరవాత ఎప్పుడో బయటికి వెళ్లడానికి నిద్దర లేచిన ఆయన భార్య, పక్కమీద భర్త లేకపోవడం చూసి, పెరట్లోకి వెళ్లిన ఆయన ఇంతసేపు ఏం చేస్తున్నారని గబగబ వచ్చి చూసేసరికి రెడ్డిగారు ఆ వరండాలో చలన రహితంగా పడిఉన్నారు. ఆవిడ గోలపెట్టి అందర్ని లేపి, రెడ్డిగారిని లోపలికి తీసుకొచ్చి డాక్టరుకోసం పంపింది.



కళాఖండం

ఫోటో—పి. ఎ. వివేకానందన్ (మద్రాసు-3)

తను ఏదన్నా చేసే స్థితి దాటిపోయిందని అరుణకి తెలిసినా ఇంజక్షనిచ్చి, సెలైన్ ఎక్కించడానికి ప్రయత్నిస్తే ఎక్కలేదు. నాడి అందడం లేదు. కళ్లు తెరుచుకుని చూస్తున్న ఆయనలో చలనం లేదు. ఇంకో అయిదు నిమిషాలకి ప్రాణం పోతుందనగా అతను కాస్త కదిలాడు. మరో ఇంజక్షనిచ్చింది అరుణ. కాస్త కళ్లు ఇటూ, అటూ తిప్పాడు. అతని కళ్లు అరుణ మీద నిలిచిపోయాయి. ఆ క్షణంలో అతని మొహంలో కనిపించిన భావం ఎవరూ వర్ణించలేరు. పాపానికి ప్రాయశ్చిత్తం జరిగిందని తెలుసుకున్న వ్యక్తి చూపది. ఏ చెయ్యి అయితే తను నరకబోయాడో, ఆ చెయ్యే తనకి ప్రాణభిక్ష పెట్టడానికి ప్రయత్నించడం చూసిన వ్యక్తి చూపు అది. అరుణకి ఆ చూపు అర్థం అయింది.

'మన పాపపుణ్యాలకి ఎప్పుడో, ఎక్కడో శిక్ష పడదు. మనం మనంత తెలివైన వారు లేరని విర్రవీగుతాము. మనం చేసే పాపపు పనులు ఎవరి కంట పడలేదని సంతోష పడతాము. కాని, మనకంటె తెలివైన వాడు, మన ప్రతి చర్య అనుక్షణం చూసి గుర్తించుకునేవాడు ఒక డున్నాడని మనం మరవకూడదు. ఆ దృష్టినించి తప్పించుకుని, శిక్షపడకుండా తప్పించుకోవడం మన తరం కాదని మన మందరం గుర్తించుకోవాలి. ఆ సంగతి మరిచిపోతే,ఆసంగతి ఏదో విధంగా గుర్తుచేయకమానదు,' తండ్రి తరుచుగా అనే ఆమాటలు గుర్తుకు వచ్చాయి అరుణకి.

అరుణ వంక చూస్తూండగానే రెడ్డిగారికి కళ్లు మూసుకుపోయాయి. ఏ పోలీసులు శిక్షించకుండానే రెడ్డి శిక్ష పొందాడు. ఏ న్యాయస్థానమూ తీర్పు చెప్ప నక్కరలేకుండానే భగవంతుడే తీర్పు చెప్పాడు.

ఏనుగులాంటి రెడ్డిని కొన్ని గంటల్లో పీనుగను చేసి వదిలింది విధి. అతడు పోయిన కబురు తెలిసి పెద్దకు, పిరడు పదో రోజుకి వచ్చారు. ప్రెసిడెంట్ భార్య మగదక్షత లేదని కూతురితో రాజీపడి వాళ్లిద్దరిని ఇంట్లోనే ఉండిపొమ్మంది.

• • •

వర్షాలు కాస్త తగ్గుమొహం పట్టాయి. ఈ ఉపద్రవాలకి, అతివృష్టికి తోడు, ఈ ఇబ్బందులకి తోడు వరద లొస్తాయేమోనని భయపడే ప్రజలందరూ కాస్త నిశ్చింతగా నిట్టూర్చారు. నిండుగా నిండి ఊరి మీద పడడానికి సిద్ధంగా ఉన్న కాలువల ఉధృతం తగ్గుమొహం పట్టింది. వర్షాలు తగ్గి, కాస్త ఎండలు రావడంతో కలరా కూడా కాస్త తగ్గుమొహం పట్టింది. అరుణ చెప్పిన ఆరోగ్య సూత్రాలు పాటించి, అనుమానం వచ్చిన వెంటనే డాక్టరు దగ్గిరకి రావడంతో కలరా చావులు తగ్గాయి.

ఊరి ప్రెసిడెంట్‌గారు చచ్చిపోతేగాని హెల్త్ డిపార్ట్‌మెంటు వారికి చురుకు పుట్టలేదు. అప్పు డొచ్చి ఊర్లో అందరికి కలరా ఇంజక్షన్లు పొడిచి వెళ్లారు. అదయినా అరుణ నాలుగుసార్లు ఘాటుగా పై అధికారులకి ఉత్తరాలు రాస్తేగాని జరగలేదు. గూడెంలో పరిశుభ్రత విషయంలో తను ఆశించిన మార్పు వచ్చినందుకు నిజంగా సంతోషించింది అరుణ.

పది, పదిహేను రోజులు గడిచిపోయాయి. అరుణ ఏ విషయమూ ఇంటికి రాయలేదు. రాస్తే అనవసరంగా వాళ్లని భయపెట్టడం, భయపడి తండ్రి తనని వచ్చేయమనడం తప్ప మరో ప్రయోజనం ఉండదని అరుణ ఆ విషయం మరిచిపోవడమే మంచిదని ఊరుకుంది.

• • •

"మరునాడు కనిపిస్తానని ఇప్పుడా రావడం? ఈ పదిహేను రోజుల నించి రోజూ మీరు వస్తారని ఎదురు చూశాను." పది గంటల వేళ వచ్చిన రమేష్‌ని సాదరంగా ఆహ్వానించి అంది అరుణ.

"సారీ! వద్దామనుకున్నాను గాని, మర్నాడే ఊరికి వెళ్లి, ఈవేళే వచ్చాను."

"ఆహా! ఇంకా సుబ్బారావు గారితో మీ గురించి అడుగుదామని అనుకుంటున్నాను. ఆ రోజు ఆ హడావిడిలో మీగురించి ఏమి తెలుసుకోలేదు. సెలవుమీద ఉన్నారా ప్రస్తుతం? ఏం చేస్తున్నారు మీరు?" కుతూహలంగా అడిగింది.

"ఇన్నాళ్లూ చేశాను. మొన్ననే రిజైన్ ఇచ్చి వచ్చేశాను." నవ్వుతూ అన్నాడు రమేష్.

"అదేం?" ఆశ్చర్యంగా అడిగింది అరుణ.

"బి. ఎస్‌సి. అగ్రికల్చరల్ పాసయి, ఏ మూడు నాలుగు వందల ఉద్యోగమో చేస్తూ బానిస బ్రతుకు బ్రతికేకంటే స్వంత వ్యవసాయం చేసుకుందామని బుద్ధి పుట్టింది."

"జై కిసాన్ అన్న మాట! బాగుంది. ఇదంతా ఏ 'పద్మశ్రీ' కొట్టేయడానికో ప్రయత్నం కాదుకదా?"

చలోక్తిగా అంది అరుణ. అతను చదువుకున్న వాడని, ఆ ఊర్లో తనకు మరో మిత్రుడు దొరికాడని చాలా సంతోషంగా ఉంది అరుణకి. ఉల్లాసంగా అన్న అరుణ మాట రమేష్ అర్థం కాక తెల్లపోయి చూశాడు. అర్థం అయిన వెంటనే తనూ నవ్వేశాడు. "ఆఁ ఆఁ ఆ పద్మశ్రీ లాన్నేదో ముందు మీదే! ఆ తరవాతే నాది!" అంత కంటె చలోక్తిగా అన్నాడు. ఈసారి తెల్లపోవడం అరుణ వంతయింది.

"అలా చూస్తారేమిటి? ఓ స్త్రీ అయి ఉండి, సుఖాలని త్యాగం చేసి, ఆదర్శంకోసం అష్టకష్టాలుపడి, ఈ ఊరి ప్రజలకి యథోచిత సేవ చేస్తున్న మీకంటె ముందు నా కొస్తుందా ఆ పద్మశ్రీ? ఏమంటారు?"

అరుణ సిగ్గుపడుతూ నవ్వింది.

"అరుణాదేవిగారూ! నిజంగా మీ ఆదర్శం కొనియాడదగినది. నిజంగా నేను ఉద్యోగం వదిలేసి ఇలా రావడానికి మీరే కారణం. ఈ ఇన్‌స్పిరేషన్ మీ రిచ్చిందే!"

"అదేమిటి, నే నేం చేశాను?"

"అవును. మామూలుగా సెలవు మీద వచ్చిన నేను మీగురించి విన్నాను. మీరు చేపట్టిన సత్కార్యం కళ్లారా చూశాను. మీ పట్టుదలకి, కృషికి ముగ్ధుడి నయ్యాను. తరవాతే నా కీ బుద్ధి పుట్టింది. ఇన్నాళ్లూ మా నాన్న—'స్వంత వ్యవసాయం చేసుకోరా. దున్నేవాడిదే భూమి అనే నినాదం వచ్చింది. ఆ భూములు కాస్తా ఊడలాక్కుంటారు. నీవు రాకపోతే అమ్మి పారేస్తాను' అని ఎన్నిసార్లు రాసినా, కేవలం ఈ పల్లెటూరిలో ఉండడం ఇష్టంలేకే రాలేదు. కానీ, మిమ్మల్ని చూశాక మనసు మారింది. ఓ స్త్రీ అయి, కష్టనష్టాలకి ఓర్చి ఓ గ్రామంకోసం మీరు పాటుపడ్డం చూశాక, మగవాడి నయి ఉండి నా గ్రామం అభివృద్ధికి నేనెందుకు పాటు పడకూడదు అనిపించింది. ఓ మూడు నాలుగు వందలకి బానిసబ్రతుకు బ్రతుకుతూ, సరిఅయిన తిండికేనా నోచుకోని ఆ పట్టణంలో ఏముందని వైరాగ్యం వచ్చింది. అంతే వెంటనే రిజైన్ ఇచ్చేశాను. నే చదివింది అగ్రికల్చర్ బి. ఎస్‌సి. కనక ఆధునిక పద్ధతులలో వ్యవసాయం చేయాలని సంకల్పం."

"బాగుంది. నిజంగా నాకు చాలా ఆనందంగా ఉంది, రమేష్‌గారూ! మీలాంటి యువకులు కొందరన్నా ఇలా ఆలోచిస్తే నిరుద్యోగ సమస్య తగ్గుతుంది. భూములున్న పొలాలు ఉన్నవారైనా ఇలా ఆలోచిస్తే, మీలాంటివా రందరూ కలిసి పల్లెపట్టున ఉండి, పల్లెల అభివృద్ధికి పాటుపడితే కొన్నేళ్లకయినా దేశం బాగుపడుతుంది. గాంధి అన్నట్టు మన దేశం అభివృద్ధి చెందాలంటే ముందు పల్లెలు అభివృద్ధి చెందాలి. ఏమంటారు? ఉపన్యాసాలు ఇస్తున్నానని నవ్వుతున్నట్టున్నారు."

"అబ్బే, లేదు. మీ ఉన్నతాశయాలని మెచ్చుకుంటున్నాను. ఆశయాలు, ఆదర్శాలు వల్లించడం అందరూ చేస్తున్నారు. అవి కార్యరూపంలో తెచ్చే వారు ఈనాటికి ఒకరయినా కనిపించినందుకు సంతోషంగా ఉంది నాకు."

"చాలు. ఇంక ఎక్కువ పొగడకండి. భరించలేను." నవ్వింది అరుణ. "రమేష్‌గారూ, నాకు మరో మిత్రులు దొరికినందుకు చాలా సంతోషంగా ఉంది. మీకు వీలున్నప్పుడల్లా వస్తూ ఉంటారు గదూ?"

"ష్యూర్!" అన్నాడు రమేష్. ఎవరో పేషెంట్లు కాచుకు కూర్చోవడం చూసి లేచాడు వెళ్లడానికి.

• • •

మర్నాడు మధ్యాహ్నం మూడు గంటలకి మామూలుగా రుక్కుని, మణిని కూర్చోపెట్టుకుని పాఠం చెపుతూంది అరుణ. ఎంత పని ఉన్నా, ఎంత అలసట అనిపించినా వాళ్లకి పాఠం చెప్పడం మాత్రం ఏనాడు అరుణ మానలేదు. ఎలాగో ఒకలాగ ఇంకో ఆరేడు నెలలు కష్టపడి చదువు చెప్పి, మార్చిలో మెట్రిక్ పరీక్షకి కట్టించాలని అరుణ ఉద్దేశం.

పాఠం చెపుతూంటే మధ్యలో గుర్తుకు వచ్చినట్టు పుస్తకంలోంచి ఓ కవరు తీసి, "మా అన్నయ్య మీ కీ ఉత్తరం ఈయమన్నాడండీ. మరిచే పోయాను" అంది రుక్కు.

"మీ అన్నయ్యా? ఏం ఉత్తరం?" అంటూనే అందుకుని, వెంటనే చించింది అరుణ. ఉత్తరం వ్రాయవలసినంత ముఖ్యమైన సంగతి ఏముంది? ఇద్దరూ ఇంచుమించు రోజూ కలుసుకుంటూనే ఉంటారు గదా? అందులో నిన్న సాయంకాలం చాలా సేపే తోటలో కూర్చున్నారు. ఆత్రతగా చదవడం ఆరంభించిన అరుణ, సగం చదివేసరికి తత్తరపడి పోయింది. అర్థం కానట్టు అయోమయంగా మళ్లీ చదివింది. అర్థం కాగానే మొహంలో రక్తం పొంగింది. 'ఛీ ఛీ! ఏమిటిది?' కలవరపడుతూ అనుకుని మిగతాది కూడా పూర్తిచేసింది చదవడం. చదవడం పూర్తిచేసే సరికి అరుణలో ఎన్నో రకాల భావాలు ముప్పిరి గొన్నాయి. సుబ్బారావు ఆ ఉత్తరం రాశాడంటే ఆమె అప్పటికీ నమ్మలేక పోతూంది. మనసంతా ఏదో చేదుతిన్న నోరులా అయిందనిపించింది అరుణకి. అన లా ఉత్తరాన్ని ఆ క్షణంలో చింపి ముక్కలు చేద్దామని అనిపించినా, ఎదురుగా రుక్కు, మణి తనవంకే చూస్తున్నారని తమాయించుకుంది. ఉత్తరం మడిచి కవర్లో పెట్టి పక్కన పెట్టేసింది. ఏం జరగనట్టు మామూలుగా ఉండడానికి ప్రయత్నించి ఎలాగో ఇంకో పది హేను నిమిషాలు పాఠం చెప్పడం పూర్తిచేసి, "ఇంక చాలు ఈవేళకి" అనేసి రుక్కుని పంపేసింది అరుణ. మణి పుస్తకాలు పట్టుకుని వంటింట్లోకి వెళ్లిపోయాడు.

ఉత్తరం పట్టుకుని పడక గదిలోకి వెళ్లి, మంచం మీద పడుకుని మళ్లీ సావకాశంగా చదవడం ఆరంభించింది అరుణ.

"అరుణాదేవికి!" అన లా సంబోధన చూడగానే అరుణకి ముందు చిత్ర మనిపించింది. ఇన్నాళ్లు ఎప్పుడూ తనని సుబ్బారావు పేరుపెట్టి పిలిచిన గుర్తు ఆమెకి లేదు. ఎదురుగా 'మీరు' అంటూ మాట్లాడే వాడు. ఇంకొకరితో చెప్పినప్పుడు 'డాక్టరుగారు' అనే వాడు.

"ఈ ఉత్తరం చదివి అపార్థం చేసుకోరనే నమ్మకంతో నా ఉద్దేశం బయటపెడుతూ రాయడానికి సాహసిస్తున్నాను. దయచేసి అన్యథా భావించకుండా పూర్తిగా చదివి మీ అభిప్రాయం తెలపమని కోరుతున్నాను. అసలు నిన్న మీతో మాట్లాడినప్పుడే చెపుదామనుకుని చెప్పలేకపోయాను. ఎదురుగా చెప్పడానికి అడ్డువచ్చేవి ఎన్నో ఉంటాయి. ఉత్తరం మూలంగా అయితేనే నే చెప్పదలచింది సరిగా చెప్పగలనని పించి ఈ ఉత్తరం రాస్తున్నాను.

నాకు తీయని భాషలో కవిత్వం చెపుతూ ప్రేమలేఖలు వ్రాయడం రాదు. అందుచేతే సూటిగా నేన అడగదలచిన విషయం ఒకే ఒక వాక్యంలో అడుగుతున్నాను— నన్ను మీరు పెళ్లాడగలరా?

ఆశ్చర్యపోకండి. ఇలా అడగడంలో అనుచితం ఉందంటారా? నేను వివాహితుడినని మీకు తెలుసు. రెండ పెళ్లి వాడినని నాకు తెలుసు. కానీ, నాకు వయస ముప్పై మాత్రమే నిండింది. సాధారణంగా రెండ పెళ్లికి అభ్యంతరం పిల్లలు. నాకు పిల్లలు లేరు. అంద చేత రెండోపెళ్లి అన్న పేరు తప్ప వివాహానికి నే నన్ని విధాల అర్హుడినే లోకం దృష్టిలో.

తరవాత నేను మీకంటె తక్కువ చదివినవాడిని ఉద్యోగం లేనివాణ్ణి. ఆ రెండు విషయాలూ మీ కభ్యంతరాలు కావని మాటల సందర్భంలో మీ మాటలవల



విడుగుతున్న చీకటి

ఫోటో—ఎమ్. జి. కె. శేఖర్ (మద్రాసు-2)

# మీకు సొమ్ము సర్దుబాటు అయేదాకా మీ వ్యాపారం ఆగదు సుందరమ్ ఫైనాన్స్ వెంటనే సొమ్ము సర్దుబాటుచేసి, ట్రక్కు కొనుక్కో డానికి సహాకరిస్తారు.

వ్యాపారం బాగా సాగాలంటే తొందరగా మీకు ట్రక్కు అవసరము. కాలయాపన చేస్తూ కూచోలేరు. సుందరమ్ ఫైనాన్స్‌వారు వెంటనే సొమ్ము సహాయం చేస్తారు. మీరు వెంటనే ఇవ్వవలసిన సొమ్ము పూర్వం ఎప్పుడూ లేనంత తక్కువ. వాయిదాల పద్ధతిని కొనుగోలు ఛార్జీల రేట్లు ఎంతో ఆకర్షణీయంగా వుంటాయి. తిరిగి చెల్లించడానికి 36 మాసాలు వ్యవధి. ఇన్సూరెన్స్ ప్రిమియములు సులభ వాయిదాల పద్ధతిని ఏర్పాటు. మీకు ఇప్పుడు వుంటున్న బళ్ల మీద గూడా సొమ్ము సహాయాన్ని పొందగలరు. ఇవి మీకు మేము చేయగల కొన్ని సహాయాలు. మేము 1970లో 3200 కాంట్రాక్టులు పరిష్కారము చేసాము.

సుందరమ్ ఫైనాన్స్ వారితో గనుక కాంట్రాక్ట్ పెట్టుకుంటే పెద్ద సంస్థ అయిన టివియస్ వారి సహకారము సానుభూతి లభిస్తుంది.

ఈ ట్రాన్స్‌పోర్టు వ్యాపారములో అరు దశాబ్దాల అనుభవంలో టివియస్ మీ సమస్యలను పరిష్కరించగల విజ్ఞానాన్ని పొందారు. వీరి విస్తృత సేవా సౌకర్యార్థము టివియస్ సంస్థలను మీరు పరిచయం చేసుకోండి.

ఏ టివియస్ సంస్థలోనైనా సరే మీరు సొమ్ము సహాయాన్ని పొందవచ్చు.





మీరు టివియస్‌ను విశ్వసించగలరు

సుందరమ్ ఫైనాన్స్ లిమిటెడ్
37 మౌంటు రోడ్డు, మద్రాసు 6

SF-6314R

గ్రహించాను. ఈ విషయంలో మరి మీ కభ్యంతరం ఉండదని నా ఉద్దేశం.

ఇకపోతే మీరు ఎన్నో సందర్భాలలో మీకు పల్లెలో ఉండడం ఇష్టమని, పల్లెటూర్లు నచ్చుతాయని అన్నారు కనక, మీ రిక్కడే డాక్టరుగా స్థిరపడే ఉద్దేశంలో ఉన్నారు కనక పల్లెటూరిలో ఉండే నన్ను వివాహం ఆడడానికి అదో అభ్యంతరం కాదని నా ఉద్దేశం.

అరుణాదేవీ! మీరు ఈ ఊరొచ్చి దగ్గిర దగ్గిర సంవత్సరం కావస్తూంది. ఈ మధ్యకాలంలో మనం అతి సన్నిహితుల మయ్యాం. నామీద మీకు ఎనలేని గౌరవం, అభిమానం ఉన్నాయని గుర్తించాను. గుర్తించ నక్కరలేకుండానే ఎన్నో సందర్భాలలో మీ నోటే ఆ మాటలు విన్నాను. ఆ మాటలువిని, ఈసంవత్సరకాలంలో మన మధ్య సాన్నిహిత్యాన్ని గుర్తుంచుకుని మీమీద నా కెలాంటి అభిప్రాయం ఏర్పడిందో, నామీద మీ కలాంటి అభిప్రాయమే ఏర్పడి ఉంటుందన్న నమ్మకంతో నా ఉద్దేశం మీ ముందు బయట పెడుతున్నాను.

మనం వివాహం చేసుకున్నా మీ డాక్టరు వృత్తికి అంతరాయం కలగదు అని హామీ ఇస్తున్నాను. అంతేకాక పైవాడిగా ఇప్పుడు చేసే సహాయం కంటె అప్పుడుగా, మీ వాడుగా మీ కెన్ని విధాల అయినా అన్ని విషయాలలో మీకు నా సహాయం లభిస్తుంది. మీకు చేదోడు వాదోడుగా ఉంటానని వేరే చెప్పనక్కర లేదు.

అరుణాదేవీ! ఆ రోజు రెడ్డిగారు మీ మీద జరిపించబోయిన అత్యాచారం గుర్తుంది కదా? ఒంటరిగా ఉన్న స్త్రీ అంటే అందరికి అలుసే. స్త్రీకి ఎప్పుడూ పురుషుడి రక్షణ అవసరం. చిన్నప్పుడు తండ్రి, వయసు వచ్చాక భర్త, ముసలితనంలో కొడుకు— ఇలా ఏదో పురుషుడి రక్షణ స్త్రీకి అవసరం. మీరు ఒంటరిగా ఉండబట్టే గదా రెడ్డిగారంత సాహసించారు? అదే మీ భర్త ఉంటే అలా జరిగేదా? అరుణాదేవీ! మీరు, మీ ఆశయాలు నాకు ఎంతగానో నచ్చాయి. మీ ఆశయాలని సంతోషంగా ఆమోదించగలిగే వ్యక్తిని మీరు భర్తగా చేపట్టడానికి సందేహించరని నా నమ్మిక. నా గుణగణాలు, కుటుంబం మంచిచెడ్డలు, నా ఆస్తిపాస్తులు, చదువుసంధ్యలు అన్నీ మీకు వేరే ఎవరూ చెప్పనక్కర లేదు. కేవలం మీకు ఇష్టమయితే 'ఊఁ' అన్న మాట చాలు. ఆ మాట నా కెంత ఆనందాన్ని ఇస్తుందో మీ రూహించలేరు.

ముఖతః చెప్పలేక నా కోరిక ఈ ఉత్తరం ద్వారా వెల్లడించాను. అలాగే మీరూ అంగీకారం అయితే మీ జవాబు ఉత్తరం ద్వారా పంపగలరు.

ఎన్నో ఆశలు, కలలు మీపై పెట్టుకున్న—
మీ సుబ్బారావు."

'ఛీ ఛీ! సుబ్బారావు ఇలా వ్రాస్తాడని, ఇలాంటి ఉద్దేశం అతనికి ఉందని కలలోకూడా ఊహించలేదు నేను.' ఉత్తరం చదివి లజ్జతో, జుగుప్సతో అరుణ మోహం ఎర్రబడిపోయింది. అతని ఉత్తరం అరుణ వేళ్లమధ్య నలిగిపోయింది.

సుబ్బారావు! సుబ్బారావుని తనెంత అభిమానించింది! నిజమే. కృష్ణమూర్తి అన్నయ్యతో సమానంగా అభిమానించింది. నిజమే. ఎంతో చనువుగా, సన్నిహితంగా మెలిగింది. కానీ, తన చనువుని, సాన్నిహిత్యాన్ని అపార్థం చేసుకున్నాడు. కలలోనైనా అసలు ఇలాంటి ఆలోచన తనకి రాలేదు. తన కెన్ని విధాలో సహాయం చేసిన సుబ్బారావుపట్ల కృతజ్ఞత, గౌరవం తప్ప మరో భావం ఊహల్లోనైనా లేదు. తన మాటలని, తన చనువుని అన్నిటిని మరిచి మరో విధంగా అర్థం చేసుకున్నాడన్న మాట సుబ్బారావు. ఛీ!

అసలు సుబ్బారావు ఎలా అడగగలిగాడు ఈ మాట? రెండో పెళ్లివాడనీ కాదు, తనకి సరిపోయే అర్హతలు లేనివాడనీ కాదు. కానీ, అసలు ఈ ఊహ ఎందుకు వచ్చిందో సుబ్బారావుకి? అభిమానంగా మాట్లాడి, కాస్త చనువుగా ఓ ఆడది మసిలిందంటే ఈ అర్థం తప్ప మరో అర్థం స్ఫురించదు గాబోలు మగవాళ్లకి.

ఇందుకే కాబోలు రెండు మూడు సార్లు తనకన్న తక్కువ చదువుకున్న మగవాడిని భర్తగా స్వీకరిస్తుందా ఆడది అంటూ ఏవేవో అడిగితే, తను ఏదో మామూలు బాతాఖానీ క్రింద అప్పు డనుకుంది. ఉద్యోగం లేదని, పొలాల్లోనే తనకి గడిచి పోతూందని తనని తను కించపరుచుకుని ఓ సారి అతను బాధ పడుతూంటే 'ఇది మాత్రం ఉద్యోగం కాదా? ఆఫీసులో కూర్చుంటేనా ఉద్యోగం? స్వయంశక్తితో ఒకరి క్రింద ఆధార పడకుండా స్వశక్తితో కాళ్లమీద నిలబడ్డంకంటె మంచి ఉద్యోగం ఏముంటుంది?' అని సమాధాన పరిచింది. ఇంత దురాలోచన మనసులో పెట్టుకుని అడిగాడని ఆ నాడు ఎలా అనుకుంటుంది అప్పుడు తను!

అసలు తను కనిపెట్టలేక పోయింది కాని, ఈమధ్య అతని చూపుల్లో, మాటల్లో ఏదో భేదం కనిపించింది చాలాసార్లు. మొదట్లో నమ్రతగా, మోహం వంకయినా చూడకుండా మొహమాటంగా మాట్లాడేవాడు.


చిత్రం

చిత్రం—పి. ఆగాచార్య ధర్మపురి)

ఇప్పుడు ఈ మధ్య కళ్లలోకి సూటిగా చూస్తున్నాడు. ఆ కళ్లలో భావం అప్పుడు అర్థం కాలేదు కాని, ఇప్పుడు అర్థం అవుతూంది. తనకి సలహాలు ఇస్తూ, ఛలోక్తులు ఆడుతూ, కొన్ని కొన్ని విషయాలలో ఆజ్ఞాపిస్తూ నవ్వుతూ మాట్లాడే సుబ్బారావుని తనెన్నడూ మర విధంగా తలచలేదు. పరిచయం పెరిగి, కొత్త తొల చనువుగా మాట్లాడుతున్నా డనుకుంది. సుబ్బారా తదేకంగా తనవైపు చూస్తూ, తను చూడగానే తడబ చూపు మరల్చుకోవడం, అప్పుడప్పుడు ముగ్ధు తున్నట్టు ఆరాధనా పూర్వకంగా చూపులు ఏ లోక లోనో ఉన్నట్టు పరవశంగా చూసేవాడు. ఆ చూపు కొత్తగా అనిపించినా, తన మనసులో మరో భావ చొరపడలేదు. అంతేకాక ఈమధ్య రెండు మూడుసార తను రమేష్‌తో మాట్లాడుతూంటే అతను చూశాడ హర్ట్ అయినట్టు, ముఖంలో ఈర్ష్య తొంగిచూసి రమేష్ పక్కనున్నంతసేపూ ముఖం మాడ్చుక కూర్చునేవాడు. అతను వెళ్లిపోగానే మళ్లీ మామూ అయ్యేవాడు. ఏదో తను అతని హక్కు అన్నట్టు మరొకరికి భాగం లేదన్నట్టు, అప్పుడే తను అ స్వంతం అయిపోయినట్టు భావిస్తున్నాడన్న మా ఈ సంగతి ఇప్పుడు గుర్తించింది కానీ, అప్పు డన ఇవేవీ తన మనసులో జొరబడలేదు. అన్నింటిని కూ దీసుకుని ఆలోచిస్తే అప్పుడే నాలుగయిదు నెలలు సుబ్బారావులో ఈ ఉద్దేశం మొలకెత్తిందని స్పష్ట అవుతూంది. తనే గ్రహించలేక పోయింది. ఇన్నాళ్ళు అడగడానికి మొహమాటపడో, ఇంకో ఊరుక ఉంటాడు. మొన్న రెడ్డి తలపెట్టిన అత్యాచా తరవాత తనని రక్షించే భారం బుజంమీద వేసుకు తనకి రక్షకుడుగా నిలబడ్డానికి ఆలస్యం చేయకూడ నిర్ణయించుకున్నా డన్న మాట. బాగుంది.

కానీ, సుబ్బారావుని పెళ్లిచేసుకోవడమా ఆ ఆలోచనే ఎందుకో కంపరం పుట్టిస్తూంది తన అంటే తనకి తగడని, అతని కా అర్హతలు లేవనిగా కానీ, ఎందుకో సుబ్బారావుని ముందు నించి స్నేహి రాలి భర్తగా, ఆ తరవాత ఓ అన్నయ్యలా మాత్ర భావించింది. అలాంటి వ్యక్తితో 'పెళ్లి' అన్న మా మనసే కాక శరీరం కూడా ఎదురుతిరుగుతూ అతనికి నిరాశ అయినా, కష్టం కలిగించినా మాత్రం ఈ కోరికను మన్నించలేదు.

వీలయినంత సౌమ్యంగా, మృదువుగా కార వివరిస్తూ, అతని కోరికని తిరస్కరించినం మన్నించమంటూ ఉత్తరం రాస్తుంది. ఎప్ప తా మిద్దరూ స్నేహితులలాగ ఉండాలని, దానికి ఈ తిరస్కృతి ఆటంకం కాదని భావిస్తున్నానని రాస్తు తనని సోదరీ సమానంగా భావించి ఎప్పటిలా అతని అభిమానం, సహాయం కోరుతున్నానని రాస్తు అతను నొచ్చుకోకుండా ఏ విధంగా రాయాలో అ మనసులో రెండు మూడు మాట్లు అనుకుని అ కప్పుడే సుబ్బారావుకి సమాధానం రాసేసి తరవాత మనసు కాస్త తేలికపడింది. సుబ్బా ఈ విషయంలో తనపై కోపగించుకోకూడదని, ఈ కారణంగా దూరం చేయకూడదని అరుణ స్ఫూర్తిగా కోరింది.

(సశేష

# పోటీకి పంపని కథ

'శుమైతాంగి



అతనే ప్రఖ్యాతి పొందిన కథా రచయిత రాజబాబు. అతని కథలంటే పాఠకులు ఉర్రూతలూగిపోతారు. అతను వ్రాసిన కథగాని, సీరియల్‌గాని లేని పత్రిక లేదు.

"అతని కథలు ఆణిముత్యాలే" అని మెచ్చుకుంటుంది స్త్రీలోకం. "చెప్పిన మాట చెప్పకుండా, వ్రాసిన కథ వ్రాయకుండా అతి నేర్పుగా కథ అల్లడంలో అతని కతనే సాటి" అని నివాళు లర్పిస్తుంది యువతరం.

"ఈ రోజుల్లో మంచి కథా రచయితే లేడు" అని మూలిగే వృద్ధ సాహిత్యాభిమానులు కూడా అతని కథా సాహిత్యాన్ని అభిమానిస్తూ ప్రశంసిస్తుంటారు.

'నేను అంత బాగా వ్రాస్తాను కాబోలు!'—పాఠకుల దగ్గర్నుంచి కుప్పతిప్పలుగా వచ్చి పడే ప్రశంసా లేఖల్ని చూసి నవ్వుకుంటాడు రాజబాబు, గర్వంతో ఉప్పొంగే హృదయంతో.

అతని కథల్లో ఆదర్శ వివాహాలు చేసుకొన్న వారు, ప్రేమ దంపతులు, త్యాగమూర్తులు నిండి ఉంటారు. ప్రేమకోసం కన్నవారి బంధాలను తెంపివేసే హీరోలు, నమ్మిన ఆదర్శాల కోసం రొమ్ములు విరుచుకు నిలిచిన హీరోలు, పెద్దల ఆంక్షల్లో బలై పోయే త్యాగమూర్తులు కొల్లలు కొల్లలుగా ప్రత్యక్షమౌతారు.

కాని, అందర్నీ మెప్పించి ఎన్నో ప్రశంసాపత్రాలను పొందిన అతని కథలు, అతని భార్యను మాత్రం మెప్పించలేకపోవడం చాలా శోచనీయమైన సంగతే.

ఓస్! ఈమాత్రం కథలు వ్రాయడం వచ్చిన ప్రతి వెధవా వ్రాయగలడు అనేంత నిరసనగా మాట్లాడుతుందామె. 'పోనీ, ఏ వెధవో వ్రాసి పొగడ్తలు పొందడం దేనికి— నువ్వే వ్రాయరాదూ ఆ కథలు?' అనాలనుకుంటాడు రాజబాబు. కాని ఆ మాటలు అనడానికి అతనికి దమ్ములుంటేగా! కథల్లో వ్రాసేంత ఆదర్శ దాంపత్యం, ప్రేమంపు దాంపత్యం కాదు వాళ్లది.

'మగవాడి యోగక్షేమాలు చూడ్డానికి, రోగం వస్తే సేవచేయడానికి ఒక తోడు విధిగా కావాలి కదూ? అది ఎటువంటిదైతే నాకేం? దాని భావాలతో, అభిప్రాయాలతో నాకు పనేమిటి?' అనుకుంటా డతను.

'నిశ్చలమైన జీవితాన్ని గడపాలంటే అండగా ఆదుకొనే తోడు కావాలికదా? ఆ తోడు ఉండేవారి అలవాట్లు ఎలా ఉంటే నాకేం?'—ఇదీ అతని భార్య అభిప్రాయం.

అలాగే గడిచిపోతున్నాయి రోజులు.

అతని కథల్లో బోసినవ్వులు కురిపించే పాపాయిలు, పిలిస్తే పలికే పాపాయిలు అతని నిజ జీవితంలోకి వచ్చి చూడరు. ఆటపాటలతో, చిలక పలుకులతో అతన్ని అలరించలేరు ఇదే అతన్ని అమితంగా బాధపెట్టే సమస్య.

ఒకసారి ఓ మిత్రుడు రాజబాబుతో అన్నాడు — "మీ కథలు చక్కని ఆదర్శ భావాలతో, అనురాగం నింపుకుని ఎంతో ఇంపుగా ఉంటాయి. ఆ కథలకు, మీ దాంపత్యానికి దగ్గర సంబంధం ఉన్నదని నా అభిప్రాయం" అని. ఆ మాట విని రాజబాబు అందంగా నవ్వాడు "మీరు చక్కగా ఊహించారు. మాది లౌ మారేజీను నన్ను తప్పించి మరెవర్నీ పెళ్లి చేసుకోనని భీష్మ ప్రతిజ్ఞ చేసినట్లు పంతం పట్టింది నా శ్రీమతి ఫలితం మా పెళ్లి. నేను కట్నంగా పదిమందిలో డబ్బు తీసుకోక పోయినా, శ్రీమతి కానుకల రూపంలో దండిగానే కొట్టుకొచ్చింది" పైకి అన్నా మనసులో — 'దానికీ, నాకూ చుక్కెదురేను. అది దక్షిణ ధ్రువమైతే, నేను ఉత్తర ధ్రువాన్ని. మా అభిప్రాయాలు భిన్నమైనవి. డబ్బు మమ్మల్ని ఒక కప్పుకింద జీవించమని శిక్షించింది' అని దీర్ఘంగా నిశ్వసించాడతను.

ఆమధ్య మరో మిత్రుడు కలిసి న్నాడు—"నువ్వు కూడా పోటీకి కథలు వ్రాయకూడదూ? ఫస్టు ప్రైజు మూడు వేలట. ఎన్ని కథలు వ్రాస్తే అంత డబ్బు వస్తుంది నువ్వు వ్రయత్నించాలేగాని ఫస్టు ప్రైజు నీకే వస్తుంది తప్పకుండా" అన్నాడు.



వయసు పొంగు. కన్నె మనసులను ప్రలోభపెట్టడం సహజమే. ఆ తరవాత వచ్చే చిక్కులతో, సమస్యలతో నిమిత్తం లేని వానిని గూర్చి ఆలోచించనివ్వని పొంగు అది. అది వారిని అంధులను చేస్తుంది. భవిష్యత్తు వారి ఊహలకు అందదు. అటువంటి సమయంలో వారికి కనిపించే దల్లా వర్తమాన కాలమే.



'ఓస్! మూడు వేలే కదా? మా శ్రీమతి పుట్టింటి మంచి ఏళ్లైవేలు తెచ్చింది' అని మనసులో అనుకున్న రాజబాబు పైకి నవ్వేస్తూ, "పోటీకంటూ ఎప్పుడూ కథలు వ్రాయడం అలవాటు లేదు. అయినా చూద్దాంలే" అన్నాడు సాలోచనగా.

రాజబాబుకి ఉద్యోగం చేయవలసిన బాధ లేదు. భార్య వెంబడి చాలా ఆస్తి, డబ్బు, బంగారం వచ్చాయి. 'అవి తినటానికే ఎవరూ లేనప్పుడు ఇంకా ఇంకా సంపాదించి ఏం చేయను? నా బదులు మరొకడు ఆ స్థానం భర్తీ చేస్తాడులే' అనే సమతాభావంతో పెళ్లయిన కొన్నాళ్లకే ఉద్యోగం విడిచిపెట్టి సాహిత్య సేవ చేస్తున్నాడు

ఎండ తీక్ష్ణత తగ్గింది. చల్లటి గాలి వీస్తున్నది పెరట్లో మల్లెపందిరి దగ్గరగా పడక్కుర్చీలో కూర్చుని సాయంత్రపు ఆనందాన్ని అనుభవిస్తున్న రాజబాబుకి హఠాత్తుగా ఓ ఆలోచన వచ్చింది 'అవునూ — నేను మాత్రం పోటీకి ఎందుకు పంపకూడదు నా రచనల్ని?' అని. ఆకుల సందుల్లోంచి తెల్లటి పొడుగాటి మొగ్గలు నక్కుమంటున్నాయి. మల్లెపూల కాలం వచ్చేసిం దప్పుడే అనుకున్న రాజబాబుకి మనసులో మల్లెమొగ్గలాంటి ఓ చిన్నది తళుక్కున మెరిసినట్లయింది. అంతే. అతను లేచి వెళ్లి ఖన్నీ తెల్లకాగితాలు తెచ్చుకుని కూర్చున్నాడు.

అతని చేతిలో కలం గంతులు వేస్తున్నది. ఏకాగ్రతతో వ్రాస్తున్నాడతను. ఓసారి భార్య వచ్చి చూసింది. మధ్యాహ్నం భోజనాల సమయంలో— 'సాయంత్రం బజారు వెళ్లే పని ఉం'దని చెప్పింది తను. 'అలాగే' అన్న పెద్దమనిషి ఆ సంగతి మరిచిపోయి కాగితాల్లో తల దూర్చేసరికి ఆవిడకు చిర్రెత్తుకొచ్చింది. 'హాఁ ఈ రోజుకి బజారు వెళ్లడం ఉత్తిదే. మనిషి కో పిచ్చి...ఈయనకు వ్రాయడం పిచ్చి, నాకు మతి పోయే పిచ్చిను.' కోపంతో ధుమధుమలాడుతూ లోపలి కెళ్లిపోయిం దామె.

భార్య రావడం గాని, తన వైపు కోపంగా చూసి విసురుగా లోపలి కెళ్లడం గాని అతనికి తెలియదు. చీకటి రేఖలు ముసురుకొచ్చి అక్షరాలు అయిక్కపోతుంటే ఇక వ్రాయడం కుదరదని లేచి గదిలోకి వచ్చాడు.

వ్రాసింది చాల్లే, అలా కాస్సేపు తిరిగి వద్దాము రా—అని శరీరం అలసట సూచించేసరికి, వ్రాసిన కాగితాల బొత్తి మీద పేపరు వెయిట్ పెట్టి బయటి



వంగిన కొమ్మ ఫోటో—వై. విఠల్‌రావు (మద్రాసు-53)

కొచ్చాడు. భార్య రుసరుసలాడుతూ ఎదురొచ్చింది. భార్యని చూశాక అతనికి భార్య బజారు వెళ్లే పని ఉందని చెప్పిన సంగతి గుర్తొచ్చింది. ఇంకేం? బాంబు పేలడానికి ముందు సూచనన్న మాట, ఆ మొహంలోని ధుమధుమలు.

ఎంత గొప్ప రచయితైనా భార్యకు లోకువే కదూ! ఆ బాంబు పేలే లోపలే అక్కణ్ణుంచి జారుకోవడం శ్రేయస్కరం అని తలపోసిన రాజబాబు సణుగుతూ, "తలనొప్పిగా ఉంది, కాంతం, అలా వెళ్లి సారిడాన్ మాత్ర తెచ్చుకుంటాను" అనేసి, భార్య "చెత్త వ్రాతల్ని వ్రాస్తే తలనొప్పి రాదా" అనేంతలోనే బయటకు దూసుకుపోయాడతను.

భర్త ప్రవర్తనకు ఉగ్రరూపం దాల్చిన కాంతం అనే చంద్రకాంత — 'మిమ్మల్నని ఏం లాభం?! మా అమ్మా నాన్నల్ని అనాలి! ఎర్రగా బుర్రగా ఉన్నారని ఓ ముద్దుకిచ్చి నా గొంతు కోశారు. ఓ ముద్దా, ముచ్చటా ఈ మొగుడి వల్ల!' అని కసిగా గొణుక్కుంది.

ఆవిడకు అప్రయత్నంగా భర్త వ్రాసిన ఆ మహారాత ఎంత గొప్పదో ఓసారి చూడాలనే బుద్ధి పుట్టి, భర్త వ్రాసుకొనే దానికి కేటాయించుకున్న గదిలోకి వచ్చింది.

బల్లమీద ఓ పెద్దగా భర్త వ్రాసిపెట్టిన కాగితాల బొత్తి కనిపించింది. ఉవశంగా ఎత్తుకెళ్లి పొయ్యిలో కుక్కేస్తే? అనిపించింది. కాని, అంతలోనే ఓ సందేహం కలిగిం దామెకు. అందరూ మెచ్చుకునే ఆ కథల్లోని గొప్పతనం తను స్వయంగా చూసి తెలుసుకుంటే ఏం? అనేదే ఆ సందేహం.

ఆ బొత్తిని చేతిలోకి తీసుకుం దామె, చదవాలనే కుతూహలంతో. పేజీలు జరుగుతున్నాయి ముందుకు.

* * *

"నువ్వు పట్నం వెళ్లిపోతావట కదూ?" పదేళ్ల మల్లిక కృష్ణ చెయ్యి పట్టుకుని దిగులుగా అడిగింది.

కృష్ణకు పదునాల్గేడులు ఉంటాయి. ఎర్రగా, బొద్దుగా, నొక్కునొక్కుల క్రాపుతో అందంగా ఉంటాడు.

మల్లిక పేరుకి తగ్గట్టుగా సన్నగా, నాజూగ్గా, కోలమొహంతో, పెద్ద పెద్ద నేత్రాలతో చలాకీగా, చురుగ్గా ఉంటుంది. అంత చిన్న గ్రామంలో పిల్లిద్దరూ విడరాని స్నేహితులు. కృష్ణ మల్లికను దేవదాసు పార్వతిని అభిమానించినట్లు అభిమానిస్తాడు. మల్లిక కూడా కృష్ణ అంటే ప్రాణం పెట్టుకుంది. పిల్లిద్దరూ గ్రామాన్ని ఆనుకుని ఉన్న ఏటి ఒడ్డున పిచ్చుక గూళ్లు కట్టుకుంటూ ఆటపాటలతో గడిపేస్తుంటారు. ఒక్కోసారి కోపం వచ్చి తన్నుకుంటారు కూడా. అప్పుడు — "కిట్టిగా, నీ జత వచ్చ్" అంటుంది మల్లిక రోషంతో.

"ఓసి, మల్లీ! వెటకారా నువ్వానూ! నీ పని పడతా నాకు" అంటాడు కృష్ణ వెక్కిరిస్తూ.

కృష్ణమీద వాళ్ల నాన్న చాలా చాలా ఆశలు పెట్టుకున్నాడు. వాటిలో అతను బాగా చదువుకోవాలని, ఎక్కువ కట్నం సంపాదించాలన్నవి ముఖ్యమైనవి.

(తరువాయి 38 వ పేజీలో)

# చిత్రాలలో విజయవాడ – శిల్పి



శ్రీ కనకదుర్గ అమ్మవారి ఉత్సవ విగ్రహం మూలవిరాట్టులాగే దర్శన మిస్త
చూపుతూ అందలి శిల్పకళా చాతురిని ఇక్కడ చూపడం జరిగింది గంగవ
ప్రతి శుక్రవారం చుట్టూ ప్ర



ంది. పంచలోహ సుందర విగ్రహ మిది. దీనిని మూడు కోణాల నుంచి
ల్లేశ్వరస్వామి విగ్రహ సహితంగా దీనిని మల్లేశ్వరస్వామి సన్నిధి నుంచి
దక్షిణం చేసి ఊరేగిస్తారు.

# పోటీకి పంపని కథ

( 35 వ పేజీ తరువాయి)

కొడుక్కి అంత చదువు అబ్బాలంటే వాడిని తప్పనిసరిగా పట్నం పంప వలసిందే ఇక్కడే ఉంటే చేలమ్మట, చెట్లమ్మట తిరిగి బొత్తిగా పాడై పోతాడని ఆ తండ్రి భయం.

దేవదాసు తండ్రిలా అతను జమీందారు కాదు. కనీసం అక్షాధికారైనా కాడు. ఏదో కొద్దిపాటి భూమి, ఇల్లు గల సన్నకారు రైతు. కాని, అతని ఆశలు ఆకాశ హార్మ్యాలను నిర్మిస్తూ ఉంటాయి.

కృష్ణ చదువుకోసం పట్నం వెళ్లబోతున్నాడనే కబురు విన్నప్పట్నుంచి మల్లిక మనసు మనసులో లేదు మల్లిక, కృష్ణుల ఇళ్లు ఒకే వీధిలో, ఆ చివర ఒకటి, ఈ చివర ఒకటి ఉన్నాయి. మల్లిక తండ్రికి ఆస్తేమీ లేదు. పాలం కౌలుకి తీసుకుని సేద్యం చేస్తుంటాడు కూలిపనులకు పోతుంటాడు. అదే వాళ్ల జీవనాధారం.

మల్లికకు, కృష్ణకు స్నేహం కలిసింది కృష్ణ క్షణం కనిపించకపోతే విలవిల్లాడి పోతుంది మల్లిక మల్లిక కనిపించకపోతే పిచ్చెక్కిపోయినట్లుంటుంది కృష్ణకు.

అటువంటి ఇద్దర్నీ కాలం విడదీసింది. చదువుల పేరుతో పట్నం మేనమామ ఇంటికి వెళ్లిపోయాడు కృష్ణ. గుడ్ల నీరు కుక్కుతూ పల్లెలో మిగిలి పోయింది మల్లిక.

సంవత్సరాలు గడుస్తున్నాయి. మధ్య మధ్య సెలవుల్లో ఆ గ్రామం వచ్చి మల్లికకు పట్నం కబుర్లు చెప్పి వెళ్లిపోతున్నాడు కృష్ణ. కాని, వీళ్లిద్దరిలో మునుపున్నంత స్నేహసంబంధాలు లేవు.

కృష్ణ పూర్వంలా పిక్క లాగులు వేసే బాలుడు కాదు. పరిపూర్ణత సంతరించుకున్న యువక రక్తం అతనిలో పొంగుతున్నది. అతని అంగాంగాల్లో అందం, తేజస్సు కన్పిస్తున్నాయి. ఉండేది పట్నంలో. ఇక సోకులకు తక్కువేమిటి? సైట్‌పాంటులు, షర్టు, పౌడర్ల వాడకం అన్నీ మరింత అందంగా తీర్చి దిద్దుతున్నాయి.

వరుసగా రెండేళ్లు ఆ గ్రామం రాలేదు కృష్ణ. ఈ రెండేళ్లలోనూ మల్లికలో చాలా మార్పు వచ్చింది. ఏపుగా పెరిగిన శరీరం పాతవి సామాన్యమైన బట్టల్లో ఇమడటం లేదు. ఇదివరకు సింక జడతో పిచ్చిపిల్లలా గంతులేసే ఆ మల్లికే ఈ మల్లికంటే ఎవరూ నమ్మలేరు. మల్లికతో పాటు ఆ గ్రామం కూడా మారి పోయింది. రెండు కాఫీ హోటళ్లు వెలిశాయి. టూరింగ్ సినిమా హాలు వచ్చింది సైకిల్ షాపు, కిళ్లీబడ్డీలు, బట్టల షాపులు స్థిరపడ్డాయి. కిరాయి రిక్షాలు ఎక్కువయ్యాయి. పేపర్లు, పుస్తకాలు దిగుమతి అవుతున్నాయి. పనిలేని పాపాటు దాయుళ్ల పోజులు ఎక్కువయ్యాయి.



మధుర మీనాక్షి ఆలయ గోపురం

ఫొటో—సి. శ్రీనివాస గాంధి

మల్లిక ఏటికి నీళ్లకెళ్లే దార్లో అబ్బాయిల సందడి ఎక్కువయింది.

అకస్మాత్తుగా వచ్చాడు కృష్ణ ఆ ఊరికి. అందు క్కారణం తల్లికి ఒంట్లో బాగులేకపోవడమే గాక, ఏదో సంబంధం చూసుకోవడం కూడా.

కృష్ణ వచ్చాడనే కబురు విన్న మల్లిక పొంగిపోయింది. ఆమె కన్నెమనసు అందమైన ఊహా లోకాల్లో విహరించ సాగింది. అతను కనిపిస్తాడేమో అని ప్రతి క్షణం ఎంతో ఆశగా ఎదురుచూడ సాగింది.

ఆరోజు సాయంత్రం మల్లిక నీళ్లకోసం బయలుదేరింది. వెనకాల భుజంమీద మృదువైన స్పర్శ ఆమెను ఝల్లుమనేలా చేసింది. దిగ్గున వెనక్కి తిరిగి చూసింది. కృష్ణ నవ్వుతూ, "ఏం, భయపడ్డావా?" అన్నాడు కొంటెగా.

'ఊఁ భయం కాదా మరి' అన్నట్లు ముసిముసిగా నవ్వింది మల్లిక. అతను కనిపించనంతసేపు కొట్టుకులాడిన అంతరంగం, కోరుకున్న వ్యక్తి ఎట్టయెదుట నిలిచేసరికి మాటలే కరవైనట్లు మూగదానిలా చూస్తూ ఉండిపోయింది మల్లిక.

"మల్లీ, నిన్ను గుర్తు పట్టలేనంత మారిపోయావు సుమా?" ఆమె అందాన్ని కాంక్షగా, విన్పంకోవంగా చూస్తూ అన్నాడతను.

"ఊఁ, నువ్వుమాత్రం మారిపోలేదా? అచ్చు దొరబాబులా ఉన్నావు!" సిగ్గుల పెళ్లికూతురులా జవాబిచ్చింది మల్లిక. ఆమె దృష్టికి కృష్ణ ఆమధ్య తను చూసిన సినిమాలోని అందాల రాజ కుమారుడులా కనిపించసాగాడు.

"అలా తోటలోకి వెళ్లి కబుర్లు చెప్పుకుందాము రా." కృష్ణ పూర్వపు చనువుతో ఆ అమ్మాయి చెయ్యి పట్టుకున్నాడు. అతని చేతిలో ఉన్న ఆమె చెయ్యి తమకాన్ని తెలియగా కంపించింది. "అమ్మో, ఇప్పుడా! చీకటి పడిందంటే అమ్మ కేకలేస్తుంది. రేపు మధ్యాహ్నం వస్తాను అక్కడికి." చెయ్యి లాక్కుని వెళ్లిపోయింది మల్లిక. ఆమె మనసంతా వివ్వరించలేనంత ఆనందంగా ఉంది. కారణం? కృష్ణ తనకోసం తహతహ లాడుతున్నాడు అది చాలదూ తనకి? 'ఇక కృష్ణ తనవాడేను.' ఈ భావం ఆమెను ఎంతో సంతృప్తి పరిచింది. కన్నెమనసు లిలాగే ప్రలోభ పడతాయి. ఆ తరవాత వచ్చే చిక్కులతో వాళ్లకు ప్రమేయం ఉండదు వయసు పొంగు ఉద్రేకం వాళ్లని అంధుల్ని చేస్తాయి. భవిష్యత్తు వాళ్ల ఊహాల కందదు. వాళ్లకు కనిపించేది వర్తమాన కాలమేను.

ఆ మర్నాడు మధ్యాహ్నం కృష్ణ సత్తెయ్యగారి మామిడి తోటలో మల్లిక రాకకోసం నిరీక్షిస్తూ కూర్చున్నాడు.

ఆకులు గలగలమన్నా ఆ అమ్మాయేనేమో అనే ఆత్రంతో తిరిగి చూస్తున్నాడు. దూరంగా మల్లిక రాక కనిపించి ఎగిరి గంతేసినంత పని చేశాడు.

"నీకు సంబంధాలు చూస్తున్నారట కదూ?" అతనికి కాస్త దూరంగా కూర్చుంటూ నిష్ఠురంగా అంది మల్లిక.

"నీ వుండగా ఎవరు నచ్చుతారు నాకు?" దగ్గరగా చేరి ఆ అమ్మాయి భుజాల చుట్టూ చేతులు వేసి లాక్కుంటూ అందంగా నవ్వాడు కృష్ణ. ఆ నవ్వు సమ్మోహనాస్త్రంలా పని చేసింది. ఇక మల్లిక అడ్డు చెప్పకుండా అతని కౌగిలిలో ఇమిడిపోయింది, బలియమైన ఏదో ఆకర్షణకు లోనౌతూ.

"ఈ సంవత్సరంతో నా చదువు పూర్తయిపోతుంది"

"ఊఁ పూర్తయిపోతే ..." అతని గుండెల్లో మొహం దాచుకుని గోముగా అడిగింది మల్లిక.

"అప్పుడు ఏదో ఒక ఉద్యోగం వస్తుంది అప్పుడు నిన్ను పెళ్లి చేసుకోవడానికి నాకు ధైర్యం వస్తుంది. ఓ వేళ అమ్మా, నాన్నా అంగీకరించకపోయినా వాళ్లని ఎదిరించైనా సరే నిన్ను పెళ్లి చేసుకోగలను" ఇప్పుడు నేను తండ్రి చాటు వాడిని, అస్వతంత్రుడిని సుమా అనే అర్థాన్నిచ్చేలా ఉన్నా యతని మాటలు.

మగవాడెప్పుడూ ఇలాగే ఆడదాన్ని వంచిస్తూ వస్తున్నాడు. ఎప్పటి కప్పుడు తెలిసి వచ్చింది అనుకుంటూనే మోహాంధకారంలో పడిపోతుంది ఆడది. తనని తను బలి చేసుకుంటుంది వివశతకు.

అందం, చదువు, సంస్కారం గల కృష్ణ మాటలకు మల్లిక పూర్తిగా లొంగిపోయింది. అతనికి తన సర్వస్వాన్ని సమర్పించుకోవంగా అర్పించుకుంది.

ఉన్నట్లుండి హఠాత్తుగా కృష్ణకు పెళ్లట అనే కబురు ఊరంతా వ్యాపించి మల్లిక వరకూ వచ్చింది. ఆ మాట వింటూనే నిర్విణ్ణురాలయ్యింది మల్లిక. ఆమెమీద పిడుగుపాటు చందమే అయ్యిందా వార్త. కృష్ణ తనవాడని, తనకు అన్యాయం చేయడని, తనని తప్పకుండా పెళ్లిచేసుకుంటాడనే దృఢ విశ్వాసంతో ఉన్న దిన్నాళ్లు. కాని ఇదేమిటి? ఇది నిజం కాకూడదు. అతను కనిపిస్తే

తనకి అన్యాయం చేయవద్దని ప్రాధేయ పడా లనుకున్నది. కాని, అతని దర్శనమే కరవైపోయింది మల్లికకు. తన గోడు ఎవరితో చెప్పుకుంటుంది? ఓ వేళ చెప్పినా తననే దుయ్యబడుతారు కాని, తన ఈనా దశకు కారకుడైన అతన్ని ఎవరూ ఏమనరు సరికదా "అతనికేం? అతను మగవాడు. ఎన్ని తప్పులు చేసినా అతనికి చెల్లుతుంది" అని వెనకేసుకొస్తారు. జరిగిపోయిన క్షణాలను తలుచుకుంటూ తన దుర దృష్టకు కుమిలిపోతున్నది మల్లిక.

తెల్లవారితే కృష్ణ పెళ్లి. ఆ సాయంత్రం ఏటికి నీళ్లకెళ్లిన మల్లిక తిరిగి రాలేదు. ఏటి ఒడ్డున నీటివారగా పడి ఉన్న బిందె తప్పించి మరే ఆధారమూ కనిపించలేదు. దాన్నిబట్టి మల్లిక ఏటిలో పడి కొట్టుకుపోయి ఉంటుందని తలపోసిన గ్రామస్థులు — "అయ్యో! అంత చక్కని పిల్ల, బుద్ధిమంతురాలైన పిల్లకు అలా రాసిపెట్టాలా దేవుని" అని తమ సానుభూతి సంతాపాలను ప్రకటించుకున్నారు.

పెళ్లికి తరలి వెళుతున్న కృష్ణకూడా ఈ కబురు విన్నాడు. 'అలాగా? పాపం' అని విచారాన్ని ప్రకటించుకున్నాడు. అంతేగాని, తన ద్రోహానికి అమాయకురాలైన ఓ అబల బలైపోయిందనే బాధగాని, దిగులుగాని లేవతనిలో.

ఎవరు పోయినా, ఎవరు ఉన్నా కాలానికి అక్కర్లేదు. దాని మానాన అది పరుగులు తీస్తూనే ఉంటుంది మామ గారి ప్రాపకంతో మంచి ఉద్యోగం వచ్చింది. డబ్బు తెచ్చిన భార్య, చీకూ చింతా లేని సంసారం, హోదాగల ఉద్యోగం, నలుగుర్లో గౌరవాభిమానాలు — వీటితో కృష్ణ జీవితం వడ్డించిన విస్తరిలా సాగిపోతున్నది. కాని పాపం! మల్లిక సంగతే ఎవరికీ తెలియదు. తన అంద చందాలతో సంచలనం రేపిన ఆ పిల్ల సంగతే అందరూ మరిచిపోయారు. అసలు మల్లిక అనే పిల్ల తమ మధ్య తిరిగింది అనే సంగతే వాళ్లు పూర్తిగా మరిచిపోయారు..."

అంతవరకూ చదివిన వ్రాత ప్రతిని బల్లమీదే పెట్టేస్తూ గాఢంగా నిశ్వసించింది చంద్రకాంత. 'బ్రతికి ఉన్న వారి సంగతే విస్మరించే ఈ ప్రజలు, చని పోయిన వ్యక్తిని మరిచిపోవడంలో వింతే ముంది?' అని కూడా అనుకుం దామె.

తమ కన్నుని తామే పొడుచుకున్నట్లు, తమ గోతిని తామే తవ్వుకున్నట్లు ఆడపిల్ల లింత మూర్ఖంగా ఎందుకు ప్రవర్తిస్తారు? చదువు, సంస్కారం అలవరుచుకున్నా, ఒక్కోసారి ఆడపిల్లలెందు కిలా తప్పటడుగు వేస్తారు? ఇటువంటి వారికి మరణం తప్పించి మరో మార్గం లేదా? ఎందుకు లేదూ? మాటల్లోకాక చేతల ద్వారా తమ సంస్కారాన్ని వెల్లడించే వాళ్లుంటే అటువంటి వారి జీవితాలు చక్కబడతాయి. అంతవరకు మోసపోయే ఆడపిల్లల గతి అధోగతే. ఇటువంటి కథలు చదివైనా ఆడపిల్లలకు కనువిప్పు కలిగితే ఈ కథ వ్రాసిన వారికి ఫలితం దక్కినట్లే . చెమర్చిన కళ్లను తుడుచుకుంటూ లోపలి కెళ్లి పోయిం దామె.

కాని, ఏ పని చేయబోయినా కృష్ణ అలా చేయకపోతే మల్లిక జీవితం మరోలా ఉండేది కదూ? అంద రాడపిల్లల్లా ఎవరో ఒకర్ని చేసుకుని, పిల్లా పాపలతో స్థిరజీవితాన్ని గడుపుతుండేది. కాని, ఆమె తొందరపాటువల్ల బంగారు జీవితాన్ని మట్టిపాలు చేసుకుంది అని ఆలోచిస్తూనే ఉంది.

చాలా రాత్రి గడిచాక వచ్చాడు రాజబాబు, అలసట గొలిపే వదనంతో.

'ఇంత రాత్రివరకు ఆ పెత్తనా లేమిటో ఈయనకు?' విసుక్కుంటూ లేచింది చంద్రకాంత, అతనికి అన్నం వడ్డించడానికి ఆమె ప్రయత్నం కని పెట్టి అతను—"అన్నం పెట్టవద్దు ఓ మిత్రుడు బలవంతంచేస్తే అక్కడే భోజనం చేసి వస్తున్నా" అన్నాడు నీరసంగా.

"ఊఁ" అని మూలిగి మంచంమీద వాలి ముసుగు పెట్టుకుం దామె.

పడుకున్నాడన్న మాటేగాని, అతనికి నిద్ర పట్టడం లేదు. కళ్లు మూసినా, తెరిచినా రక్తం మడుగులో కొట్టుకునే ఆ శరీరం, దాని మీద వాలి హృదయ విదారకంగా విలపించే ఆకారం కళ్ల ముందు ప్రత్యక్షమౌతూ అతని గుండెల్ని చెదరగొట్టుతున్నాయి. గతం కళ్లెర్ర చేస్తూ అతన్ని ఉలిక్కిపడేలా చేస్తున్నది. బాధగా కణతల్ని రుద్దుకుంటు న్నాడు. బాధపడే అంతరంగాన్ని శాంతింప జేయడానికి వృథాప్రయాస పడుతున్నాడు. కాని, అతని అంతర్వేదన తొలగిపోవడం లేదు. ఎలా పోతుంది? చచ్చిపోయింది అనుకునే వ్యక్తి తన కళ్లముందు ప్రత్యక్షం కావడం, తను భయభీతుడై బిగిసి పోవడం, తనని రక్షించటంకోసం. తనని మృత్యువు కోరల నుంచి తప్పించడంకోసం ఆమే ఆదేవతకు బలికావడం—అంతా క్షణాల మీద, తను ఇది అనుకునేంతలోనే జరిగి పోవడం అంతా గమ్మత్తుగా, బాధగా ఉంది. కళ్లు చూసిన దృశ్యాన్ని మనసు నమ్మలేకపోతున్నది.

"అదే, పిచ్చిది! కారుకింద పడిపో యిందే" అన్న అరుపులు మిన్ను ముట్టే సరికి తను తేరుకుని రోడ్డుమీదకు చూశాడు. అంతే. అతని కళ్లు చెదిరి పోయాయి. రక్తం మడుగులో విలవిలా కొట్టుకుంటున్నది, ఒకానొకనాడు తన అపురూపమైన అందంతో తన కామ దాహాన్ని తీర్చిన శరీరం.

'మల్లిక .. మల్లిక చనిపోలేదూ? ఇన్నాళ్లూ అజ్ఞాతంగా ఉండిపోయిందేం మరి?' రాజబాబు వెర్రివాడిలా అటు పరుగెత్తాడు కాని, అప్పటికే చుట్టూ చేరిన జనం ఆ శరీరాన్ని సమీపంలో ఉన్న ఒక ప్రైవేటు హాస్పిటల్లో చేర్పించారు.

"ఈ ప్రమాదం ఎలా జరిగిందండీ?"

"వెనకాల కారు, ముందు లారీ .ఎటు తప్పించుకోవాలో తోచలేదు కాబోలు— నిష్కారణంగా ఓ ప్రాణం బలైపోయిం దీవేళ." ఇలా వినిపిస్తున్నాయి మాటలు. కాని రాజబాబుకి అవేమీ వినిపించడం లేదు. 'ఆవిడ నాకు తెలుసు. ఆమెది మా ఊరే. నన్ను రక్షించబోయి తను బలైపోయింది' అని గట్టిగా అరిచి చెప్పాలనుకున్నాడు. కాని, తన హోదా, అంతస్తు చప్పున స్ఫురణకొచ్చి గొంతులో మాటలు గొంతులోనే ఉండిపోయాయి

"అమ్మా, మా అమ్మ .. మా అమ్మేది? ఎక్కడుంది?" అని ఏడుస్తూ వచ్చిందో పిల్ల. ఆ పిల్లని చూస్తూనే ఉలిక్కిపడ్డాడు రాజబాబు. వద్దను కుంటూనే ఆ పిల్లవైపు చూశాడు మళ్లీ మళ్లీ ఆ ముక్కు, నోరు, కళ్లు—అన్నీ తనవే. జడకి బదులు క్రాఫ్; చొక్కా, నిక్కరు వేస్తే అచ్చు తనలాగే ఉంటుంది. ఈ పిల్ల... మల్లిక కూతురా! ఈ పిల్లని తను చాలాసార్లు రోడ్డుమీద, పెంట కుప్పల దగ్గర, చెత్తకుండీల దగ్గర చూశాడు. కాని, అప్పుడు మరో భావంతో చూశాడు. 'తిండికి లేని అభాగ్యులు. పిల్ల బ్రతుకులు చెట్టుకింద, చెత్త కుండీల దగ్గర గడిచిపోతాయి. గత జన్మ లోని నేరానికి పిల్లకీ శిక్ష విధించి ఉంటాడు భగవంతుడు' అనుకుంటూ ఏమరుపుగా, త్రుణీకారంగా చూసేవాడు. 'కాని ... కాని, ఆ పిల్ల ఎవరో కాదు, తన రక్తంలో రక్తం, తన కామానికి చిహ్నం; మల్లిక అమాయకత్వానికి చిహ్నం' అనుకోగానే అతనికి అక్కడ నిలుచోవాలని పించలేదు తప్పు చేసి, తప్పించుకు పోయే నేరస్థుడిలా ఇవతలకు పారిపోయి వచ్చే శాడు. కాని, మనఃస్థిమితం పోయిం దతనికి.

నిద్రపట్టక మంచం మీద అటూ, ఇటూ దొర్లుతున్నా డతను. క్షుభిత హృదయం రోదిస్తున్నది దీనంగా 'అదే నీ భార్య స్థానంలో ఉంటే ఆ ... బిడ్డని విడిచిపెట్టి ఇలా వచ్చేవాడి... అసలు ఆ మల్లిక అలా కావడానికి ... డివి నువ్వే కదూ? నువ్వే ప్ర... పెట్టకపోతే తమా ఒకరికి ఇ... ఎక్కడో సుఖంగా బ్రతికేది కాని, త... యోగం లేకుండా చేశావు. ఆ ... నీ రక్తాన్ని పంచుకు పుట్టిన ... దిక్కులేని దానిలా చేశావు?' అని ... తున్నది అంతరాత్మ 'నీతో మా... మంటూ ఉంటే వెళ్లి వాళ్ళని ఆద... ఆ పిల్లకు రక్షణ కల్పించు నీ ... మాపించు' అని హితబోధ చేస్తున్న...

'అవును తను చాలా పాపం చే... ఓ అమాయకురాలి జీవితంతో ... లాడుకున్నాడు అందుకే తన సంసా... సుఖం లేదు, శాంతి లేదు తన సం... నిలిపే యోగం కూడా లేదు ఆ పా... ఈ శిక్ష అనుభవిస్తున్నాడు తను. జన్మకీ శిక్ష చాలు దీనికి నిష్క... పిల్లద్దరిని ఆదుకుంటాను. ఆ ... దత్తత చేసుకుని నా అనంతరం ఆస్తికి వారసురాలిగా చేస్తాను ' ... క్కుడే నిర్ణయాని కొచ్చిన రాజ... వెంటనే ఆ ప్రైవేటు హాస్పి... ఫోను చేశాడు— "ఆక్సిడెంటుకి గ... ఆవిడ స్థితి ఎలా ఉంది? ... చెప్పండి" అంటూ

అవతల్నుంచి డాక్టరో, కంపౌ... గాని విసుగ్గా జవాబిచ్చాడు—"ఆ ... చనిపోయింది" అని "ఆ పిల్లో?" గొంతు కటువుగా పలికింది: " ... పోయేవాళ్లందర్నీ అజమాయిషీ ... పూచీ మాది కాదు, సార్. ఆ పిల్ల... డికి పోయిందో మాకు తెలియదు.' ... తల ఫోన్ తక్కువ పెట్టేసిన ... వినిపించి నిరాశగా వెనక్కి తి... రాజబాబు. గదిలో కొచ్చిన అతని ... తను వ్రాస్తూ వ్రాస్తూ వ... కాగితాలు కనిపించాయి. అవి చూ... అతనికి నవ్వొచ్చింది. 'నేను ... కథా రచయితను కదూ? ఇక రేప... నేను కథలు వ్రాయను. ఇంకె... వ్రాయను!' పిచ్చివాడిలా గొణు... ఆ కాగితాల్ని పర్రున చించేశాడు ...

శబ్దానికి లేచి కూర్చున్న ... కాంతం అతని ప్రవర్తనకి విస్తు... "అయ్యో! ఆ కథ కాగితాల్ని ... చించేశారేం?" అంది.

"ఈ కథని పోటీకి పంపించడం ... కాంతం. ఇదే కాదు, ఇంకెప్పుడ... భర్త కథలు వ్రాయడం నువ్వు మ... హామీ ఇస్తున్నా." జీవం ... నవ్వుతూ వెళ్లి మంచం మీద ప... ముసుగు బిగించాడు రాజబాబు.





డుంబు
చెప్పిన
కథ

5-1-72
వ తేదీ సంచికలో
ప్రారంభం





# రాక్షసుడు బంగారు పొడుం కాయ

బొమ్మల కథ

## బుజ్జాయి

ప్రమదావనం

# 'సర్వేంద్రియాణాం...'





'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అని ఆర్యోక్తి. అనేక చిత్ర విచిత్రాలతో కూడిన భగవంతుని సృష్టిని చూసి ఆనందించడానికి ఈ నయనాలే కదా సాధనాలు! అయితే, మన దేశంలో సరైన శాస్త్రపరిజ్ఞానం లేని కారణంచేత అనేకమంది కంటిచూపును కోల్పోవటం జరుగుతూంది.

పూర్వం మశూచికం ప్రబలంగా ఉండే కాలంలో, అనేకమంది సరిగ్గా కంటిజాగ్రత్త తీసుకోని కారణం చేత అంధత్వానికి బలి అవుతుండేవారు. కాని ఇప్పుడు పుట్టిన సంవత్సరంలోపల, తిరిగి ప్రతి మూడేళ్లకు అన్ని ఆస్పత్రులలోనూ టీకాలు వేస్తుండటంవల్ల చాలావరకు మశూచికాన్ని, తద్వారా అంధత్వాన్ని అరికట్ట డానికి వీలవుతున్నది.

ఇక గ్రామాలలో, పల్లెలలో అంధత్వానికి మరో ముఖ్య కారణం 'కౌచింగ్'. సాధారణంగా పల్లెవాసులు కంటిరోగం ఏది వచ్చినా ముందుగా వీధుల్లో ఆకలముల పసర్లు పిండే బైరాగుల నాశ్రయిస్తారు. వీళ్లు కొన్ని సమయాలలో కంటిలో ఏదైనా పడినప్పుడు వాటిని తీయడానికి కొన్నిరకాల శస్త్రచికిత్సలుకూడా చేస్తుంటారు. దీనికే 'కౌచింగ్' అని పేరు ఆంగ్లంలో. వాళ్లు ఉపయోగించే పరికరాలు సరిగ్గా శుభ్రంచేయబడని కారణంగాను, వారికి కంటి నిర్మాణం గురించి తెలియని కారణంగాను ఇటువంటి చికిత్సలవల్ల కంటిలోని నల్ల గుడ్డు ( కార్నియా ) దెబ్బ తిని క్రమంగా అంధత్వానికి దారి తీస్తుంది.

ఇక చిన్నతనంలోనే కంటిచూపును కోల్పోయే దురదృష్టం మన దేశంలో ముఖ్యంగా ఆహార లోపం వల్ల కలుగుతున్నది. కంటిచూపు సరిగ్గా ఉండటానికి, కంటి ఆరోగ్యానికి ముఖ్యమైనది 'విటమిన్-ఎ'. ఇది పాలు, వెన్న, నెయ్యి మొదలైన కొవ్వుపదార్థాల లోనూ, చేపలలోనూ, కారట్లు మొదలైన దుంపకూర ల్లోనూ, ఆకుకూరల్లోనూ విరివిగా లభిస్తుంది. ఈ విటమిన్ లోపంవల్ల కంటిలోని తెల్లగుడ్డుమీద నల్లని త్రిభుజాకారపు చుక్కలు బయలుదేరుతాయి. వీటిని 'బిటాట్ స్పాట్స్' అంటారు. క్రమంగా రేచీకటి ( నైట్ బ్లైండ్‌నెస్ ), కండ్లు పొడిబారి క్రమంగా కంటిచూపు తగ్గిపోతుంది. దీన్నే 'గ్జిరోసిస్' అంటారు. దీన్ని అశ్రద్ధ చేస్తే నల్లగుడ్డు ( కార్నియా )కూడా దెబ్బ తిని 'కెరటో—మలేసియా' అనే వ్యాధికి దారితీసి, శాశ్వతంగా కంటిచూపును దూరం చేస్తుంది. కాబట్టి పైన చెప్పిన లక్షణాలలో ఏవి కనిపించినా అశ్రద్ధ చేయక వైద్యులను సంప్రదించడం ముఖ్యం. పైన చెప్పిన ఆహార పదార్థాలన్నిటిలోనూ చౌకగా లభించే ఆకుకూరలనైనా రోజూ ఉపయోగించటం, వీటితో బాటు 'విటమిన్ ఎ' మాత్రలను కూడా వాడటంవల్ల తీవ్రపరిణామాలకు దారితీయకుండా కాపాడవచ్చు.

కంటిలో సాధారణంగా ఏవైనా నలకలు, దుమ్ము పడుతూనే ఉంటాయి. అటువంటప్పుడు చల్లని నీరు కంటిలో కొట్టుకోవడం, శుభ్రమైన దూదితోగాని, బట్టతోగాని జాగ్రత్తగా ఆ నలకను తీసివేయడం చేయాలేగాని, మొరటుగా కంటిని నలిపి వేయకూడదు.

ఇప్పుడు మన రాజధాని ఢిల్లీలోను, చుట్టుపక్కల వ్యాప్తంగా ఉన్నది 'వైరల్ కంజెన్‌క్టివైటిస్' లేక కండ్లకలక. ఇది ఒకరినుండి మరొకరికి అతి సులభంగా వ్యాపిస్తుంది. కండ్లు ఎర్రబడి నీరు కారడం, కండ్లలో దురద మొదలైనవి. కండ్లకి నల్ల కళ్లద్దాలు ధరించి, వెంటనే వైద్యసలహా పొందడం అవసరం. ప్రతి రెండు గంటలకి 'టెర్రామైసిన్' కంటి డ్రాప్స్ వాడటంవల్ల వారం రోజుల్లో ఈ కండ్లకలక తగ్గిపోతుంది.

ఇక విపరీతమైన తలనొప్పి, దగ్గర లేక దూరపు వస్తువులు సరిగ్గా కనిపించనందుకు చత్వారపు కళ్లజోడు ఉపయోగించవలసి వస్తుంది. అయితే, చిన్నతనంలోనే వీటిని వాడవలసివస్తే ( ముఖ్యంగా ఆడపిల్లలకు ) సిగ్గుగా అనిపించటం సహజం. బాగా వెలుతురుగా ఉండేచోట చదవటం, మరీ చిన్న అక్షరాల పుస్తకాలు చదవకపోవడం, కంటినిండా నిద్రపోవడంద్వారా ఈ కళ్లజోడు రాకుండా చేసుకోవచ్చు. నిమ్మకాయరసం, టొమాటోలు కండ్లను కాంతివంతంగా, చురుకుగా ఉంచుతాయి.

ఈ విధంగా ఆహార విషయంలో తగిన శ్రద్ధ తీసుకుని, నియమవంతమైన అలవాట్లతో, కంటికేదైనా చికాకు కలిగినప్పుడు డాక్టరును సంప్రదిస్తూ, బైరాగి చిట్కాల కోసం పరిగెత్తకుండా ఉంటే అన్నిటి లోకీ ప్రధానమైన నయనాన్ని, తద్వారా వెలుగుతో నిండిన ఈ చైతన్య జగత్తిని చూసే అవకాశాన్ని కల కాలం కాపాడుకొనవచ్చు! ★

**డా॥ టి. కళ్యాణ**
**సచ్చిదానందం**

# జవాబులు

**-మాలతీ చందు**

### ఒక సోదరి, . . . . .

"గ్రాడ్యుయేట్ నయ్యాను. కాన్వొకేషన్‌కి వెళ్లాలని ఉంది. ఎంతో సరదా పడ్డాను. దానికీ వీల్లేదన్నారు ... పెండ్లి అయేవరకు నేను ఒక్క సినిమా చూడలేదంటే నమ్ముతారా? నాకు చూడాలని కూడా ఉండేది కాదు... ఆయన మనసారా నవ్వలేరు; ఒకరు నవ్వితే చూడలేరు ... నా అన్నం నేను తినాలి. కేవలం నా భర్త నీడను నేను బతకాలి..."—విశుద్ధాశయాలతో ప్రారంభమైన జీవితాలను ధనకాంక్ష ఎలా దగ్ధం చేస్తుందో, వేడి కన్నీటితో మీరు వ్రాసిన వేదనాపూరిత లేఖ చెబుతున్నది. ఎన్ని రత్నాలు రాళ్లలో కలిసిపోయి వెలుగు ముఖం చూచేందుకు నోచుకోవోగదా! ఈ రత్నం అలా కాలగర్భంలో కలిసిపోకూడదనే నా ఆకాంక్ష. ధనసేకరణే ప్రధానమైనప్పుడు కట్టుకున్న భార్య, కన్నకూతురు వంటి బంధాలు కూడా మాసిపోతాయి—ఎవరికోస మీ సంపద అనే ధ్యాస తెరమరుగవడంతో కళ్లకు గంతలు కడుతుంది ధనపిశాచి. కాలం, ఖర్మం కలిసిరాగా, అందుకు అదృష్టం తోడైతే, ఇదంతా తన ప్రయోజకత్వమే ననుకుంటూ అహంభావి, స్వార్థపరుడూ, నిరంకుశుడూ అవుతాడు — అతి సామాన్యుడు కూడా! రెండు లక్షల కట్నానికి ఆశపడి పెళ్లి చేసుకొన్న తమ్ముడు, ఇంకొక అయిదేళ్ళు పోతే తండ్రి వలె కాడని నమ్మకమేమిటి? అందరినీ తన గుప్పెట్లో అట్టే పెట్టుకోవాలనే భూఖామందు మనస్తత్త్వమే, మీ కుటుంబ సుఖ శాంతులని హరించింది. అందుచేత, కాలాతీతం కాకపూర్వమే ఆ విషవలయంనుంచి తప్పించుకు మీ తోటి కోడలు ఉన్న ఊరు వెళితే, మీరూ, మీ పిల్లలూ సుఖంగా ఉండవచ్చు. అదొక్కటే తరణోపాయం.

### ఎస్. జె. ఎల్., హైదరాబాదు-29

"నాకు ప్రతి రాత్రీ నిద్రలో కలలు వస్తాయి. ఇలా కలలు రావటం ఆరోగ్యలక్షణ మంటారు కొందరు. సరైన నిద్ర లేకపోతే కలలు వస్తాయి, అది అనారోగ్యానికి దారి తీస్తుంది అంటారు మరికొందరు. మరి మీరు. . ."— జీర్ణనాళిక సరిగా లేకపోతే కొంచెం శ్రద్ధ తీసుకోవాలితప్ప, కలలు రావడం ఆరోగ్య లక్షణమే — అందుకు సందేహం లేదు. హెరాయిన్ వంటి మత్తుపదార్థాలు సేవించేవారికి రంగురంగుల అల్లిబిల్లి లోకం కనిపిస్తుంది గాని కలలు రావు. కలలు రాకపోవడమే వారి ఆరోగ్యం దెబ్బ తినడానికి ప్రధాన కారణ మంటున్నారు సైకాలజిస్టులు. మీకు నిద్ర పట్టిన గంటా గంటన్నర లోపున, ఆ పైన మెలకువ వచ్చేముందు మాత్రమే కలలు వస్తాయి. అవి అజ్ఞాత కోరికలు కావచ్చు; నిత్యజీవితంలోని అలజడికి ప్రతిముద్ర కావచ్చు. మనోవల్మీకం నుంచి తొంగి చూసే సంగతులు కావచ్చు; ఏమైనా కాలావధులతో నిమిత్తం లేకుండా విశృంఖలంగా పరుగులు తీస్తాయవి. పలక తుడిచి పరిశుభ్రం చేయడమూ, టేప్ రికార్డర్‌లోని 'టేప్'ని క్లీన్ చేయడమూ వంటిది ఈ కలల పంట.

### టి. బి. ఎల్., అనంతపురం

"నాకు ప్రస్తుతం 28 సంవత్సరాలు. మా ఇంటిలో వాళ్లు నాయొక్క వివాహము గురించే ఆలోచించడం లేదు. మాకు డబ్బులేదు. నేను ఎస్. ఎస్. ఎల్. సి. పాసయినాను. మా ఇంటి ఎదురింటిలో ఒకతను ఇంజనీరింగ్ పాసయినాడు. ప్రస్తుతం ఉద్యోగం లేదు. అతను నన్ను మనఃస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడు. వాళ్లు, మేము ఒకే వీధిలో 6 సంవత్సరముల నుండి ఉంటున్నాము. అతను మా ఇంటికికూడా వస్తుంటాడు. మంచివాడు. నన్ను వివాహం చేసుకుంటానని ప్రమ కూడా చేసినాడు ...'' — బాగానే ఉంది. ఉద్యోగం లేదు— మీకు డబ్బులేదు. ఇక, మీ ఇ పెళ్లి చేసుకోవడం ఎలా? ప్రేమగారి పీలు ప్రేమనివాస్‌లో ప్రేమ తింటూ బతకలేరుగా! వయసులో మీ వాళ్ళు మీకు పెళ్లిచేసి ఉండవల కాని, మధ్య తరగతి కుటుంబాలలో ఆడపిల్లల అంటే, తాహతుకి తగ్గ ధనంపోసి, వరుని కొనుక్కో మవుతున్నది. ఇక మీ విషయ మంటారూ, ఆ కుడు అంత యోగ్యుడూ, నమ్మకస్తుడూ అ ముందు ఉద్యోగం సంపాదించుకు, ఆపైన మి తీసుకు వెళ్లమనండి. అలేక, ప్రేమ మరొక నెలలు ఆగకపోదు. ఇద్దరి మనసులూ కలసి, పరిస్థి అనుకూలిస్తే, పాతిక రూపాయల్లో తేలిపోయే తంతు దే మున్నది? ?

### వై. వి. ఎల్., మచిలీపట్నం

"సినిమాలలో హీరోకి ఏదైనా భరిం కష్టంగాని, దుఃఖంగాని వస్తే, వెంటనే ఏ క్లబ్ వెళ్లి, ఒక డాన్సర్‌తో రాగ తంటనాలాడినట్లు స్తారు. నిజజీవితంలో కూడా ఇంతేనేమో ..." అప్పే, నిజజీవితంలో అలాటి క్లబ్బులూ ఉం డాన్సర్లూ ఉండరు. ఇంటి కాలస్యంగా వస్తే పిల్లలకు సంజాయిషీ చెప్పుకోవాలి. "నాన్నా, ఇం చెక్కడి కెళ్లావ్?" అని పిల్లలు అడుగుతారు. " కనిపించిందా?" అని నిలవదీస్తుంది భార్య.



# ప్రతి భోజనములోను మోడర్న్ బ్రెడ్ తినండి

स्लाइस्ड सफ़ेद सैंडविच ब्रेड
modern

ఆరోగ్యకరమైన శరీర పెరుగుదలకు, రోజంతా సత్తువకు మీకు సంతుష్టికరమైన భోజనము కావలయును. ప్రొటీన్లు, విటమిన్లు, గోధుమ పిండి, మరియు ఆరోగ్యమును చేకూర్చే పదార్థములు అన్నీ కలిసిన మోడర్న్‌ను మీకూ, **మీ పిల్లలకూ పోషకవంతమైన బ్రెడ్‌గా తయారుచేయబడినది.**

***ప్రతి తునకలో కొద్ది పోషకత్వము కలదు***



మోడర్న్ బేకరీస్ (ఇండియా) లిమిటెడ్, (భారత ప్రభుత్వపు సంస్థ)
బ్రాంచ్‌లు: అహమదాబాద్ □ బెంగుళూరు □ కలకత్తా □ కొచ్చిన్ □ ఢిల్లీ □ హైదరాబాద్ □ కాన్పూర్ □ మద్రాస్

maa.MB.962 TEL

## ఎస్. వి. ఎమ్., ఎల్లికల్లు

"2—10—68 సంచికలో నా ప్రశ్నకు మీరు సమాధానమిస్తూ, శతాయుష్కుడైన బ్రహ్మ ఇప్పుడు 53 వ ఏట ఉన్నాడని చెప్పారు. కాని, 25—11—70 సంచికలో 'కె. పి. కరీంనగర్' ప్రశ్నకు జవాబిస్తూ బ్రహ్మ ఇప్పుడు 51 వ ఏట ఉన్నాడని చెప్పారు. ఇందు ఏది సరియైనదో తెలియక తికమక పడుచున్నాను. . ."— 43 లక్షల 20 వేల సంవత్సరాలు ఒక మహాయుగం అంటే, కలి, ద్వాపర త్రేతా, కృత యుగముల మొత్తం. ఈ మహాయుగాలు 71 ఒక మన్వంతరంతో సమానం. 14 మన్వంతరాలు బ్రహ్మదేవుని సృష్టికల్పం. అంటే పగలు. శతాయుష్కుడైన బ్రహ్మకు, ఇప్పుడు 51 సంవత్సరాలు నిండి, మొదటి నెల శుక్లపక్షంలో ఉదయాది 13 ఘడియల 42 విఘడియలయింది ఇంకా మధ్యాహ్నం కాలేదు. అది ఏభై ఒకటి, ఏభై మూడు కాదు. ఏభై మూడు అని చెప్పి ఉంటే పొరబాటు.

## ఎ. వి. ఎస్., నిడుబ్రోలు

"విక్రమ్ యూనివర్సిటీలో (ఉజ్జయిని) లేడీస్ హాస్టల్ ఉంది అన్ని చోట్ల ఉన్నట్లు కాదు. ఇది చాలా భిన్నమయింది. వాళ్లకున్న నార్త్, సౌత్‌ఫీలింగ్, ఎందాకా పోయిందంటే, ఈ ఏడు హాస్టల్లో నార్త్‌ఇండియన్ వింగ్ అనీ, సౌత్‌ఇండియన్ వింగ్ అనీ ఏర్పాటు చేశారు. వార్డెన్సూ, యూనివర్సిటీ లెక్చరర్సూ ఇటువంటి ప్రాంతీయతాభావాలు పెంచడం మంచిదంటారా? వాళ్ల యూనివర్సిటీలో మాకు సీట్లు ఇవ్వడం వాళ్ల సహృదయతకు నిదర్శనమట. అది కాదనలేము గాని, మమ్మల్ని పట్టుకొని మీరు దక్షిణ భారతంలో పుట్టినందుకు మాతో కలవడానికి అనర్హులు అంటే, ఎంత బాధగా ఉంటుందో ఆలోచించండి. విద్యావంతులే ఇలా ప్రవర్తిస్తూ ఉంటే, మిగిలిన వాళ్ల సంగతి చెప్పాలా? ఈ విషయం మీ దృష్టికి తేవాలనే ఉద్దేశంతో ఈ లెటర్ వ్రాశాను. . ." విశ్వవిద్యాలయాలు సంకుచిత భాషాబోధనాకేంద్రాలవడంతో, నిర్వాహకులకు నిచ్చెన మెట్లెక్కాలనే తపన తప్ప, నవయువతకు మార్గదర్శకంగా నడుచుకోవాలనే ధ్యాస లేదు. యువతలు పెరుగుతున్న అశాంతికీ, ఆందోళనకీ తా మెంతవరకూ బాధ్యులో, ఒప్పుకోలేని భీరువులయారు నాయకులు. ఒకప్పుడు రోమ్ నగర వీధులలో ఇరవై భాషలు మాట్లాడేవారట. అయినప్పటికీ భాషకంటె భావం ప్రధానమని వారు గ్రహించారు, గనకనే చరిత్రగతిలో 'రోమ్' అన్ని శతాబ్దులు అవిచ్ఛిన్నంగా నిలబడ గలిగింది. కాని, మనం ఆంగ్లం కొద్ది మంది మేథావులభాష అనే నెపంతో, వివిధ రాష్ట్రాలమధ్య వంతెనలు వేసి జాతీయ పోరాటంలో అమోఘ సేవచేసిన ఈ ప్రపంచ భాషను పక్కకు నెట్టి, ప్రతి ఒక్క భాషనీ అందల మెక్కించడంతో, అల్పచింతన అన్నిటా అలుముకు, ప్రాంతీయతా భేదాలు పెంచుతున్నది. తమ పదవులు కాపాడుకొనే తాపత్రయంలో అందుకు అనుగుణంగా తాళం వేస్తున్నారు దేశాన్ని తీర్చిదిద్దవలసినవారు. విశ్వవిద్యాలయాలు ఇలా గోడలు కట్టుకోవడం విజ్ఞత గల వారెవరూ హర్షించరు.

# మార్గదర్శులు

## మొదటి జలాంతర్గామిలో...

★ ★ ★

మొదటిసారి జలాంతర్గామిలో పయనించింది ఓ డచ్చి శాస్త్రజ్ఞుడు- కార్నిలిస్ వాన్ డ్రెబిల్ (1572-1634).

కర్రతో చేసి చర్మంపైన తాపడం చేసి ఇనుప మేకులతో కట్టి తయారు చేసిన పడవ అయనది. లోపల ఉన్న టాంకులలోనికి నిరు వదలి ఈ బోటును నీటి లోపలికి దింపేవారు. తిరిగి ఆ నీటిని బయటికి త్రోసివేసే వీలు కూడా అందులో ఉంది.

ఈ చిత్రమైన జలాంతర్గామిని థేమ్సు నదిలోనికి 1624 వేసవిలో వదిలారు. కింగ్ జేమ్స్-I పరివారంతో చూస్తుండగా డ్రెబిల్ మిగతవారితో బోటును నీటిలో దింపి లోలోననే వెస్టమినిస్టర్ నుంచి గ్రీన్‌విచ్‌దాకా అయిదు మైళ్ళు నడిపించారు.





## ఎస్. పి. ఆర్., హైదరాబాదు

"మా బంధువులలో ఒకరికి 'ఫైలేరియా' వస్తే, హైదరాబాదులోని జయసూర్య హోమియోపతి కాలేజీ వైస్—ప్రిన్సిపాల్‌గారు నయం చేసినారు. కనక అమలాపురం సోదరి ఇక్కడ ప్రయత్నం చేయవచ్చు" — 'అడవి చెన్నంగి' అంటే ఏమిటో తెలుపమని చాలా మంది వ్రాశారు. విజయవాడ సోదరి పంపిన 'చిట్కా వైద్యం' అచ్చు కిచ్చానేగాని, ఆ [illegible] ఎలా ఉంటుందో, ఆయా మండలాలలో దానిని పేరుతో పిలుస్తారో నాకూ తెలియదు. ఇప్ప[illegible] హైదరాబాదు సోదరి హోమియో వైద్యం [illegible] తున్నారు. వాపు ముదరకుండా ప్రారంభదశ[illegible] ఉన్నప్పుడు శ్రద్ధ తీసుకుంటే, 'ఫైలేరియా' అరికట్టవచ్చు.




ఈ రోజు నుండి మన చింతపండు పేరు ఇన్‌స్టామ్. చింతపండు
తన హెూదా పెంచుకొంది. ఇది ఆధునిక శాస్త్ర పరిశోధన వల్ల సాధ్యపడింది.
ఇన్‌స్టామ్ రూపంలో చింతపండు, చాలా చిక్కని గుజ్జుగా, తక్షణతయారీ చింత పండుగా అవుతుంది.
ఇన్‌స్టామ్‌లో రసాయనములు గానీ, రంగులుగానీ చేర్చబడ లేదు. పరిశుభ్రముగా శుద్ధి నొంది, అందమైన
గాజు జాడీ లో మీ చేతికి వస్తుంది! బజారులో, అంగడిలో, మట్టి పేరుకొన్న బుట్టలతోను, క్రిమి
కీటకాలతోనూ ఉన్న చింతపండుకి యిక పనిలేదు. ఇన్‌స్టామ్‌తో వంట ఎంతో రుచి– చిన్న చెంచాడు
ఇన్‌స్టామ్‌తో ఎనిమిది మందికి సరిపడే వంట చేసుకోవచ్చు. ఇప్పుడు ఇన్‌స్టామ్‌కి మీ ఆధునిక గృహంలో
దక్కని చోటు దొరికింది. సెన్‌ట్రల్ ఫుడ్ టెక్నొలాజికల్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారి
పరిశోధనా ఫలితం ననుసరించి అతి పరిశుభ్రముగా ఉత్పత్తి చేయబడింది.

శ్రీ వెంకటేశ్వర ఫుడ్ ప్రాసెసింగ్ (ప్రై) లిమిటెడ్, ఎస్. వి. రోడ్, నిడదవోలు– ప. గోదావరి జిల్లా. ఆం. ప్ర.

ఆంధ్రప్రదేశ్‌లో అన్ని చోట్ల లభించును. దక్షిణ ఇండియాలో ప్రాతినిధ్యంలేని పట్టణాలకు
డిస్ట్రిబ్యూటర్లు కావలెను.

# రాజమహల్

గోపి లాయర్ బాలసుందర్రావు వద్దకు వచ్చాడు. తనకు కావలసిన వ్యవహారాలను గురించి అడుగుతున్నాడు.

"రఘు తండ్రి రాఘవేంద్ర బహద్దూర్‌గారి ఆస్తికి సంబంధించిన డాక్యుమెంట్సన్నీ మీ వద్దనే ఉన్నాయనుకుంటాను."

"నో... ఇటీవలే రఘుకి అన్నీ అప్పచెప్పేశాను."

"డబ్బు మొత్తం రఘుకి ఇవ్వటం జరిగిందా?"

"అదేగా మా బాధను... రాఘవేంద్రగారు చనిపోయేముందు ముప్పై లక్షల రూపాయలు బ్యాంక్ నుండి డ్రా చేశారు. అవేమైనాయో అర్థం కావడం లేదు."

"అంటే అంత మైకం ఏమయిందంటారు?"

"ఏం చెప్పమంటారు చెప్పండి? రాఘవేంద్రగారు అసలే పిసినారి. డబ్బు దాచేసేడు. ఎక్కడో పాతిపెట్టి ఉంటాడు. దొంగలు అది కనిపెట్టి రోజూ కన్నాలు వేస్తున్నారు."

"దొంగలూ, దయ్యాలూ, భూతాలూ వీటితో వేగలేక రఘు రాజమహల్‌ని అమ్మేస్తానంటున్నాడు. మరి మీ ఉద్దేశ్యం..."

"నా ఉద్దేశ్యమంటూ మరొకటి లేదు. చనిపోయిన రాఘవేంద్రగారి ఉద్దేశ్యమే నాదీనూ..."

"ఏమి టది?"

"రాజమహల్‌ని ఎవరికీ అమ్మరాదనీ, ఎవరూ కొనరాదనీ, ఎన్నటికీ అది వంశపారంపర్యంగానే రావాలనీ వారు వీలునామాలో వ్రాసిపెట్టారు."

"దటీజ్ ఆల్‌రైట్... వెళ్లొస్తాను."

కుతూహలం కలిగించే ఈ సన్నివేశం హరికృష్ణా ఫిలిమ్స్ 'రాజమహల్' చిత్రంలోనిది. పదునైన కథతో గేవాకలర్లో నిర్మాణమవుతున్న ఈ చిత్రం త్వరలో ఆంధ్ర అంతటా విడుదల కాబోతున్నది. సంగీతం శ్రీ టి. వి. రాజు. ఛాయాగ్రహణం శ్రీ బి. నారాయణ. దర్శకత్వం శ్రీ బి. వి. కృష్ణమూర్తి.

# రిక్షా రాముడు

మాణిక్యాన్ని తుపాకీతో కాల్చి చంపడమే కాకుండా, పెట్రోలు పోసి దహనం చేసేశాడుకూడా రాజారావ్. ఆ ఘాతుకాన్ని కళ్లారా చూసిన రాముని హృదయం ఉడికిపోయింది. దిక్కులేని మాణిక్యం బిడ్డను చంకనేసుకుని రాజారావ్ తరపున వాదిస్తున్న వకీలు ధర్మరాజు ఇంటికి వచ్చాడు రాము. కానీ, ఎదురుగుండా ఊహించని విధంగా రాజారావ్ ఎదురుపడి కళ్లెర్ర చేస్తూ "నిన్నెవరు రానిచ్చారు లోపలికి? ఇక్కడి కెందుకొచ్చావ్?" అని హుంకరించాడు.

"ఒక ఖూనీకోరుకి ఉపకారం చెయ్యవద్దని వకీలుగారికి చెప్పాలని వచ్చాను."

"పాపం, నిన్ను చూస్తుంటే పరితాపంగా ఉంది."

"పరితాప పడేందుకు ఒకటి సజ్జనుడైనా కావాలి, లేదా మేధావైనా కావాలి నువ్వు రెండూ కాదు."

"ఒక రిక్షావాడికి ఇంత తలపొగరా?"

"ఊరివాళ్ల సొత్తుతో ఒళ్లు పెంచుకునే ఒక ఖూనీకోరుకే ఇంత తలపొగరున్నప్పుడు... ఒళ్లొంచి సంపాదించే రిక్షావాడికి ఎందుకుండకూడదు?"

"నేను తుపాకీతో మాట్లాడడానికి అలవాటుపడ్డవాణ్ణి."

"నేను పటాలాలతో ఫిరంగుల మధ్య పోరాడివచ్చినవాణ్ణి."

"నన్ను పశువును చెయ్యకు."

"ఇప్పుడేం నువ్వు మనిషివా?"

ఉద్వేగంతో కూడిన సన్నివేశాలు, ఉజ్జ్వలంగా నడిచిన కథాసంవిధానంతో భారీఎత్తున రంగులలో అత్యంత రమణీయంగా నిర్మించబడిన శ్రీ విఠల్ అండ్ సేలం రాజకుమార్ ఫిలిమ్స్‌వారి 'రిక్షారాముడు' చిత్రంలోని దీ సన్నివేశం. ముఖ్యపాత్రలలో పద్మిని, మంజుల, ఎస్. జి. రామచంద్రన్, జ్యోతిలక్ష్మి, జయకుమారి, చో మున్నగు వారున్నారు. రచన రాజశ్రీ. సంగీతం శ్రీ ఎస్. ఎస్. విశ్వనాథం, రాఘవులు. దర్శకత్వం ఎస్. కృష్ణస్వామి. నిర్మాతలు ఎస్. సి. గోపాలస్వామి, బి. విఠలాచార్య. అన్నపూర్ణా ఫిలిమ్స్ ద్వారా త్వరలో ఈ చిత్రం ఆంధ్ర అంతటా విడుదల కాబోతున్నది.

# అమ్మ మాట

"అబద్ధం ఆడినందుకు మన్నించండి. కానీ కాలేజీలో నాకు నిజంగా పాఠాలు బోధపడటం లేదు ఈయన బాగా చదువుకున్నారుగదా అని కాస్త చెప్పమంటే ససేమిరా చెప్పనన్నారు" అని అన్నది బుంగమూతి పెడుతూ శోభ

ఆమెవైపే ఘాటుగా చూస్తూ, "ఇప్పు డర్థం అయిందా?" అని అన్నాడు తల్లి వంక తిరిగి రఘు.






నిర్మాతలు

బిక్కూలాల్ అగర్వాల్, జి.సి.గుప్త, యు.యస్.నాయుడు

దర్శకత్వం: కె.యస్.ఆర్.దాస్

పూర్ణా రిలీజ్





హైదరాబాదులో ఇటీవల జరిగిన చిత్రకళా ప్రదర్శనంలోని చిత్రాలు

**ఆకాశమంటే శిఖరాలు** చిత్రం—జి. రంగారెడ్డి

**ఇద్దరు బాలికలు** చిత్రం—ఎమ్.,ఎ. కరీమ్

అడుగడుగునా హృదయాన్ని జలదరింపజేసే సంఘటనలతో, ఉత్సాహం కలిగించే సన్నివేశాలతో, మధురమైన సంగీతంతో నిర్మాణ మవుతున్న కె. ఎస్. ఆర్. పిక్చర్స్ వారి 'కొరడా రాణి' త్వరలో విడుదల కాబోతున్నది. ప్రధాన పాత్రలలో జ్యోతిలక్ష్మి, రామకృష్ణ, రాజబాబు, రమాప్రభ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి ఉన్నారు. సంభాషణలు శ్రీ కృష్ణమోహన్. సంగీతం శ్రీ సత్యం. సహ దర్శకుడు శ్రీ కె. ఎస్. ప్రసాద్. నిర్మాత, దర్శకుడు శ్రీ కె. ఎస్. రెడ్డి. ఈ చిత్రం ఆంధ్రలో శ్రీ లక్ష్మీ నారాయణ పిక్చర్స్ ద్వారాను, రాయలసీమలో శ్రీ వేంకట రమణా పిక్చర్స్ ద్వారాను, నైజాంలో శ్రీ పద్మా పిక్చర్స్ ద్వారాను, మైసూరులో సుధాచిత్ర ద్వారాను విడుదల అవుతుంది.

## భార్యాబిడ్డలు

మోహన్ రాజారావుగారి దగ్గర పర్సనల్ సెక్రటరీగా ఉద్యోగంలో చేరాడు. నెలనెలా అతను భార్యా బిడ్డలకు పంపే డబ్బు సవతి అక్కగారు కాజేస్తూంది. అది తెలిసి మోహన్ తల్లి జయమ్మ ఏమి టిది అని అడిగితే, నోటికి వచ్చినట్లల్లా మాట్లాడింది కనకం. ఆ అవమానం సహించలేక, జయమ్మ కుటుంబంతో కొడుకును వెదుక్కొంటూ పట్నం చేరింది.

మోహన్ అనుకోకుండా తల్లిని, భార్యాబిడ్డల్ని కలిసి, వాళ్లను తన స్నేహితుడు మనోహర్ ఇంటికి తీసుకువెళ్లాడు.

"భగవంతుడు మంచివాళ్లకే ఎందుకు అన్యాయం చేస్తాడో! పాపం, కృష్ణను చూడు. . . అంత చిన్న వయసులో అంత తెలివితేటలు, అంత మంచితనం అన్నీ ఇచ్చి మాట లేకుండా చేశాడు."

"మాటలు వచ్చి ఉంటే, మంచితనం ఉండేది కాదేమో. . . దేవుడి పనులకు అర్థాలు తెలిస్తే దేవుడే ఉండడు. . . సరే, నాకు టైమయింది. ఆఫీసుకు వెళ్లాలి. . ."

"అర్ధరాత్రి ఆఫీసు ఏమిట్రా?"

"నా ఆఫీసుకు పగలూ, రాత్రీ అంటూ లేదమ్మా! ఇరవైనాలుగు గంటలూ డ్యూటీలో ఉండాలి. ఉన్నానో, లేదో చూడ్డానికి నా మీద ఇద్దరు సూపర్‌వైజర్లు—పగ లొకరు, రాత్రొకరు."

"అదేం ఉద్యోగంరా ఎక్కడా వినలేదు! ఎంత ఇస్తారేమిటి జీతం?"

"అదికూడా అంతేనమ్మా, ఒక లెక్కా పక్కా లేదు! ఎంత కావలిస్తే అంతా తీసుకోవచ్చు!"

"నాన్నా. . . నాన్నా! ఎంత కావలిస్తే అంత డబ్బు తీసుకోవచ్చుగా! మొత్తం డబ్బంతా తెచ్చేస్తే, అప్పుడు ఉద్యోగమే చెయ్యనక్కరలేదు."

కమనీయమైన ఈ సన్నివేశం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి పూర్తి రంగుల చిత్రం 'భార్యాబిడ్డలు' లోనిది. చక్కని కథాసంవిధానంగల ఈ చిత్రం సంక్రాంతికి విడుదల కాబోతున్నది. రచన ఆచార్య ఆత్రేయ. సంగీతం శ్రీ కె. వి. మహాదేవన్. దర్శకత్వం శ్రీ తాతినేని రామారావు. నిర్మాత శ్రీ ఎ. వి. సుబ్బారావు. నవయుగ ద్వారా ఈ చిత్రం విడుదల అవుతుంది. ★

"ఏమిట్రా అర్థమయ్యేది? ఏదో పాపం, భయపడి అట్లా చెప్పి ఉంటుంది. అయినా నీ చదువుకి, భవిష్యత్తుకి దేవుడిలా ఆదుకున్న ఆ జగన్నాథరావుగారికి మనం ఎంతో ఋణపడి ఉన్నాంరా. . . కాస్త పాఠం చెప్పమంటే కళ్ల కద్దుకు చెప్పొద్దురా. . ." అని హితబోధ చేస్తున్నట్లుగా అన్నది తల్లి లక్ష్మి.

"అది కాదమ్మా. . ."

"చాలు, ఇంకేం మాట్లాడకు. . . చూడమ్మా, వాడి ధోరణే అంత. నువ్వేం అనుకోకు. రేపట్నుంచి తప్పకుండా వచ్చి పాఠం చెబుతాడు. ప్రతి రోజూ సాయంకాలం అయిదు గంటలకు వస్తాడు."

లక్ష్మి మాటలకు సంతోషాన్ని, కృతజ్ఞతను వెల్లడి చేసింది శోభ. రఘు మాత్రం కోపంతో ఉడికిపోయాడు.

"అమ్మా, అమ్మా. . . ఇది మరీ అన్యాయం. . ."

"ఏమిట్రా కుర్రతనం చేష్టలు. . . చూడు, రఘూ. . . నువ్వు ప్రతి రోజూ వచ్చి ఆ అమ్మాయికి పాఠం చెబుతావని మాట ఇచ్చాను. ఆ పైన నీ ఇష్టం."

అమ్మ మాటను మీరగలడా? మరి ఏం చేస్తాడో. . .?

విజయలక్ష్మి మూవీస్ వారి 'అమ్మ మాట' చిత్రం త్వరలో నవయుగద్వారా ఆంధ్ర అంతటా విడుదల కాబోతున్నది. రచన శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ. సంగీతం శ్రీ రమేష్ నాయుడు. దర్శకత్వం శ్రీ వి. రామచంద్రరావు. నిర్మాత శ్రీ జి. వి. ఎస్. రాజు.



## బీదల పాట్లు

దర్శక నిర్మాత శ్రీ బి. విఠలాచార్య అక్కినేని నాగేశ్వరరావుకథానాయకుడుగా శ్రీ విఠల్ ప్రొడక్షన్స్ అండ్ కో పతాకం క్రింద భారీఎత్తున ప్రముఖ తారాగణంతో నిర్మిస్తున్న సాంఘిక చిత్రానికి 'బీదల పాట్లు' అనే పేరును నిర్ణయం చేశారు. ఇతర ముఖ్య పాత్రలలో గుమ్మడి, నాగయ్య, చంద్రమోహన్, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, చంద్రకళ, విజయలలిత, కృష్ణకుమారి, సూర్యకాంతం, బేబిగౌరి, బేబిమున్ని, కాశీనాథ్ తాతా, సారథి, మాస్టర్ శేషగిరిరావు ఉన్నారు. సంభాషణలు శ్రీ డి. వి. నరసరాజు. సంగీతం శ్రీ కె. వి. మహదేవన్. ఛాయాగ్రహణం శ్రీ ఎస్. వెంకటరత్నం. కళ శ్రీ జి. వి. సుబ్బారావు. సేలం, హొగెనక్కల్ ప్రాంతాలలో ఇటీవల కొన్ని ఔట్‌డోర్ సన్నివేశాలను చిత్రీకరించారు. ఈ చిత్రం అన్నపూర్ణా ఫిలిమ్స్‌ద్వారా విడుదల కాబోతున్నది.



నవభారత్ మూవీస్
'రైతు కుటుంబం'లో నాగేశ్వరరావు

## ఉత్తమ గాయనిగా జానకి ఎన్నిక

వివిధ భాషలలో మూడు వేల అయిదు వందల పాటలు పాడి బహుళ జనాభిమానాన్ని పొందగలిగిన గానసరస్వతి శ్రీమతి ఎస్. జానకి 1970 వ సంవత్సరపు ఉత్తమ గాయనిగా మూడు బహుమతులు పొందారు. మలయాళ చిత్రరంగంలో ఉత్తమ గాయని బహుమతిని శ్రీ అచ్యుతమీనన్, తమిళ చిత్రరంగంలో ఉత్తమ గాయని బహుమతిని శ్రీ కరుణానిధి ఈమెకు అందజేశారు. మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్ వారు తెలుగు చలనచిత్ర రంగంలో ఉత్తమ గాయనిగా ఈమెను సత్కరించారు.

## జగత్ జెంత్రీలు

తన సర్వస్వంగా చూసుకునే ఒక్కగానొక్క కుమార్తె జపాన్‌లో చదువుకుంటూ భూకంపానికి బలైపోయిన కారణంగా జీవితంపై విరక్తి చెందిన రాజా రఘువీరసింహ తనకు తరతరాలుగా సంక్రమిస్తూ వచ్చిన బంగారు ఇటుకల పాతరను ప్రభుత్వ రక్షణ నిధికి ఇవ్వాలని నిర్ణయించుకొని హైదరాబాద్‌కు ప్రయాణమయ్యాడు. హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ గాలిని చీల్చుకుంటూ దూసుకుపోతున్నది. అంత స్పీడులోకూడా ఒక అత్తరుసాయబు ఆ రాజా ప్రయాణం చేస్తున్న పెట్టెలోకి జొరబడ్డాడు. ఆ రాజాతో ప్రయాణం చేస్తున్న రాజాగారి బంట్రోతు అత్తరుసాయబుని వారిస్తాడు.

"ఏయ్ ... రిజర్వేషను పెట్టె ఇది. దిగు దిగు..."

"అరె యార్ ... అత్తర్‌సాహెబ్‌కు రిజర్వేషన్ గిజర్వేషన్ నై. . . సబ్ ఏకీ క్లాస్ హై. . ."

లోపలికి వచ్చిన అత్తరుసాయబు రాజాగారిని చూసి సలాం చేశాడు.

"ఆదా బరజ్ హై, రాజాసాబ్. . . మీది పేరు విన్నాం, మీది ఫోటో చూశాం. . . మై సత్తర్ కా బచ్చా. మేరా అత్తర్ బహుత్ అచ్ఛా. . . దేఖో నా సాబ్ దేఖోనా. . ."

"నా కివేమీ వద్దు, నాయనా. . ."

"అయ్యో, మీది వద్దు. మాకీ కావాలా, సాబ్. . . మాది సెంటు బహుత్ పసందని మీరు సిఫార్సు చేస్తే ప్రపంచమంతా మోగిపోవాల. . . మాది జేబు పైసాతో నిండిపోవాల. . . దేఖో నా సాబ్ దేఖో నా. . ."

అత్తరుసాయబుగా రాజబాబు, రాజాగా పి. వెంకటేశ్వరరావు నటించిన ఈ హాస్యరసభరితమైన సన్నివేశం ఫల్గుణావారి 'జగత్‌జెంత్రీలు' చిత్రంలోనిది. ప్రధాన పాత్రలలో శోభన్‌బాబు, వాణిశ్రీ ఉన్నారు. రచన శ్రీ దాసరి నారాయణరావు. సంగీతం శ్రీ కోదండపాణి. ఛాయ శ్రీ కన్నప్ప. దర్శకత్వం శ్రీ పి. లక్ష్మీదీపక్. నిర్మాతలు శ్రీ పి. ఏకామ్రేశ్వరరావు, శ్రీ కె. రాఘవ. లక్ష్మి ఫిలిమ్స్ ద్వారా ఈ చిత్రం విడుదల.

## రైతు కుటుంబం

రాము అన్న కుమార్తె లక్ష్మికి వివాహం నిశ్చయమయింది. రాము తమ్ముడు మధు పెళ్లికి వెళ్లే ప్రయత్నంలో ఉన్నాడు. మధు భార్య గీతకు ఆ పల్లెటూరు, అక్కడి వాతావరణం నచ్చలేదు. అందుకని పెళ్లికి వెళ్లటానికి ఇష్టపడలేదు.

"గీతా! నేను పెళ్లికి వెళ్లుతున్నాను."

"మంచిది. వెళ్లిరండి."




శారద ఒక చిన్న చేతి సంచీతో బెదురుబెదురుగా చూస్తూ తడబడుతూన్న అడుగులతో గేటులోంచి ఇంటి వరకూ వచ్చి ఆగిపోయింది. ఆమె వేషం కూడా అంతంతమాత్రంగానే ఉంది. వరండా ఊడవటానికి వచ్చిన పంగి ఆమెను చూచి "ఎవరమ్మా?" అని అడిగింది.

దానికి బదులుగా "విశాలాక్షమ్మగారిల్లు ఇదేనా?" అని అడిగింది. అమ్మగారి పేరుతో అడగటం పంగికి ఆశ్చర్యం వేసినా అమ్మగారికి తెలిసినవాళ్లేమో అని, "ఇదేనమ్మా. లోపలికి రండి" అని చెప్పి లోపలికి తీసుకుపోయి కూర్చోమని చెప్పి ఇంటి లోపలికి వెళ్లింది.

సోఫాలో ఒక మూలకి ఒదిగి కూర్చుంది శారద. అంతా కొత్తగా ఉంది. గుబులుగా ఉంది. ఆ ఇంటి వాతావరణంతో తన హీన పరిస్థితి పోల్చుకోబోయింది. ఎంతో ఆశతో ఇంత దూరం వచ్చింది. ఈ ఇంటిలో తనకు ఎలాంటి ఆదరణ లభించగలదో ఊహించటానికి కూడా భయంవేసింది.

"ఎవరమ్మా?" అన్న గంభీరమయిన స్వరం విని తల పైకెత్తి చూసింది. తన ఎదురుగా ఉన్నది ఏ దేవతాస్త్రీయో అనిపించింది. నిండయిన విగ్రహం. చేతులకు రవ్వల గాజులు, చెవులకు రవ్వల దుద్దులు, మెడలో చంద్రహారం, పట్టుచీర, నుదుట ఎర్రని కుంకుమ మెరుస్తూండగా ముఖంలో తనెన్నడూ ఊహించనంతటి శాంత గాంభీర్యం ద్యోతకమౌతూంటే నోట మాట రాక శిలా ప్రతిమలా ఉండిపోయింది.

శారదను చూస్తున్న విశాలాక్షమ్మగారు కూడా కాస్తంత ఆశ్చర్యపోయింది. 'ఈ అమ్మాయిని ఎప్పుడూ చూసినట్లు లేదే!' అనుకుంది. ఆ పిల్లలో

యౌవనం తప్ప ఇంకే ఆకర్షణా లేదు. చామనఛాయ, ముక్కుచప్పిరి, కళ్ళు కూడా విశాలమయినవి కావు. చిన్న నుదురు. నోరుమాత్రం పొంకంగా ఉంది. అన్నిటిని మించి ఇంత చిన్న వయస్సులో ఆ మొహంలో అంత దైన్యం ఏమిటో అనుకుంది. నిలబడిన శారదను కూర్చోమని చెబుతూ తాను ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుంది.

"చెప్పమ్మా, ఎవరికోసం వచ్చావు?" అని అడిగింది. ఎలా చెప్పాలో శారదకు అర్థం కాలేదు. కొంచెం తటపటాయించి, "కలకత్తానుంచి వచ్చాను. మా నాన్నగారు వాసుదేవరావు గారు" అని మాత్రం అనగలిగింది. అంతటి శ్రీమంతురాలితో తన బాంధవ్యం తనకు తానుగా చెప్పుకోలేక పోయింది.

విశాలాక్షమ్మలో జ్ఞాపకపు పుటలు వేగంగా తిరిగాయి. "మీకీ ఉత్తరం కూడా ఇచ్చారు" అంటూ సంచీలోంచి ఒక ఉత్తరం తీసి ఇచ్చింది శారద. ఉత్తరం విప్పగానే ఆ దస్తూరి చూసి విశాలాక్షమ్మగారి మొహంలో ఆనందం వెల్లివిరిసింది. ఆప్యాయంగా శారదను చూస్తూ "నువ్వు వాసన్నయ్య కూతురువా?" అని అడిగారు. "అవు

వత్తయ్యా" అన్నది.

విశాలాక్షమ్మగారు ఉత్తరం చదివి లేచి ఎదురుగా ఉన్న శారదను ఆప్యాయంగా దగ్గిరకు తీసుకొంది. "ఈ మాట చెప్పటానికి ఇంత ఆలస్యం ఎందుకు చేశావు, శారదా? ఇన్నాళ్ళూ పడిన కష్టాలు మరిచిపో. మీ నాన్న నా స్వంత అన్న. ఇది నీ ఇల్లు. ఇకనుంచి నీ బాధ్యతంతా నాది" అంటున్న అత్తయ్య పాదాలపై కృతజ్ఞత నిండిన శారద వాలిపోయింది.

"ధన్యురాలను, అత్తయ్యా. నీ దగ్గిర ఒక పనిమనిషిగా అయినా ఉంటాను గాని, నన్నా నరకంలోకి వెళ్ళమనకు" అంది శారద గాద్గదికంగా.

"ఛీ, పిచ్చిపిల్లా! నువ్విక ఇక్కడే ఉంటావు. లే, పద. తరవాత అంతా మాట్లాడుకోవచ్చు" అంటూ ఆప్యాయత కురిపిస్తూ ఆమెను లేవనెత్తి లోనికి తీసుకుపోయింది విశాలాక్షమ్మ.

* * *

అందవిహీనగా పుట్టడం శారద చేసుకున్న మొదటి పాపం. రెండవది— పుట్టగానే తల్లిని స్వర్గానికి పంపడం. తల్లిని ఆమె స్వర్గానికి పంపిందో లేదో గాని శారదను మాత్రం ఆమె తల్లి నరకంలో విడిచి వెళ్ళింది.

శారద పుట్టగానే తల్లి పోయింది. తండ్రి వాసుదేవరావుకి వంటమనిషి పార్వతితో సంబంధమేర్పడి పిల్లతో సహా కలకత్తా వెళ్ళిపోయాడు. అక్కడ వారిద్దరూ భార్యాభర్తలుగా, శారద వారి బిడ్డగా చలామణి అయారు. వాసుదేవరావుకి కూతురుపై వాత్సల్యమున్నా పార్వతిని ఎదిరించే శక్తి లేదు. పార్వతి పార్వతమ్మ అయింది. ఆమె పెట్టిన నరక బాధలలోనే శారద యుక్తవయస్కురాలయింది. తండ్రి నేర్పిన చదువూ, తను స్వయంగా కృషిచేసి అలవరుచుకున్న సంస్కారం తప్ప మ్యాలు ముఖం ఎరగదు. అయితే ఆమె పడిన కష్టాల ద్వారా వంట, ఇల్లు చక్కపెట్టుకోగలగటం, సహనం—బాగా నేర్చుకుంది.

శారద పెళ్ళి ఒక సమస్య అయింది. ఈ కాలం పెళ్ళికొడుకులు కోరేదేమీ ఆమె దగ్గిర లేదు. పోనీ, కావలసినంత కట్నం పోసయినా తేవాలి అంటే సాధ్యం కాదు. తండ్రికి ఉన్నా పార్వతమ్మ ఒప్పుకోదు. అందుచేతనే పార్వతమ్మకు వెంగళరావనే వెకిలి తమ్ముడు, మేలవిడిచిన పిన్నమ్మ కొడుకు ఉన్నాడని జ్ఞాపకం రాగా వాళ్ళను రప్పించి సంబంధం స్థిరపరిచింది.

అవాకారి అయినంత మాత్రాన, అస్వతంత్రురాలని ఆమెలోని కోరికలు అడుగంటలేదు. ఈ పెళ్ళికి ఆమె మనసు ఒప్పుకోలేదు. తండ్రి దగ్గిర మొరపెట్టుకొన్నా లాభం లేదని తెలిసిన శారద పెళ్ళి రెండు రోజు లుందనగా ఎవరూ లేని సమయం చూసి ఉరి పోసుకో ప్రయత్నించింది. కాని దైవవశాత్తూ ఆసరికి తండ్రి రావటాన విఫలమయింది. శారద తెగువ చూచిన వాసుదేవరావు వణికిపోయాడు. వెంటనే నిశ్చయానికి వచ్చాడు. బజారుకెళ్ళిన పార్వతమ్మ రాకముందే శారదను హౌరా స్టేషన్‌కి తెచ్చి, విశాఖపట్టణంలో ఉన్న తన చెల్లెలి దగ్గిరకెళ్ళమని చెబుతూ ఈ విషయమంతా ఉత్తరం వ్రాసి ఇచ్చాడు.

> **సౌందర్యాన్ని ఆరాధిస్తున్నాం అనుకొనేవారిలో చాలా మందికి బాహ్య సౌందర్యమే కనిపిస్తుంది. ఆ అందాల బందిఖానాలో వయసు మొగ్గలు వేస్తుంది. కాలం నేర్పిన పాఠాలూ, వయసు చెప్పిన సత్యాలూ మనసుకు తాకినప్పుడుగాని ఆత్మసౌందర్యం అన్నది గోచరం కాదు. అటువంటి అవగాహన ఆత్మసౌందర్యదష్టి కలిగినప్పుడే...**

* * *

స్నానమదీ అయిన తరవాత విశాలాక్షమ్మ శారదకు ఇల్లంతా చూపించి, "పద, మీ బావని చూద్దువుగాని" అంటూ కొడుకు గదిలోకి తీసుకువెళ్ళింది. "బాబూ, ఆనంద్, వాసు మామయ్య కూతురు శారద వచ్చిందిరా!" అంది.

"వాసుమామయ్యా?" అన్నాడు జ్ఞాపకం చేసుకుంటూ తల్లి వైపు తిరిగి. శారద సిగ్గుపడుతూ బావని చూసింది. అతని రూపాన్ని చూసి విస్తుపోయింది. తెల్లని బట్టలతో మరీ తెల్లని రంగుతో మెరిసిపోతూన్న ఆ స్ఫురద్రూపి బుగ్గలమీద, నుదుటిమీద, చేతుల మీద కాలిన మచ్చలు వికృతంచేస్తూ కనిపించాయి. నల్ల కళ్ళద్దాలు పెట్టుకున్న అతని కళ్ళు ఆమెని చూచి ఏమన్నాయోనని కాస్త జంకింది.

"అవును, బాబూ! నువ్వు ఆరేళ్ళవాడివయి ఉన్నప్పుడే మనందరికీ దూరంగా వెళ్ళిపోయాడు. మళ్ళీ ఇన్నాళ్ళకు జ్ఞాపకం వచ్చాము. తన కూతురు శారదను నాకు ఆసరాగా ఉంటుందని పంపించాడు" అన్నగి.

"మంచిది. చాలా సంతోషమమ్మా" అనేసి ముఖం తిప్పుకున్నాడు.

"పద, శారదా! ఇకనుంచి మీ బావకు నువ్వే తోడుగా ఉండాలి" అని చెప్పి బయటకు నడిచింది. అంతవరకూ ఎన్నో కబుర్లు చెబుతున్న ఆమె ముఖంలో నీడలు అల్లుకోవడం శారద గ్రహించగలిగినా అర్థం కాలేదు.

వంటమనిషికి వంటలు పురమాయించి శారదను తన గదిలో దగ్గర కూర్చోపెట్టుకొంది. ఆ కొలది వ్యవధిలోనే శారద ఆమె కెంతో ఆత్మీయురాలిగా, తన కన్న బిడ్డగా అనిపించింది.

"బావను చూశావుగా, శారదా? ఆనంద్ ఒక్కడే నాకు బిడ్డ. ఆ ఒక్కడయినా తల్లిగా నేను చెప్పుకోకూడదు కాని, రత్నం లాంటి వాడు. మా కే విషయంలోనూ చింత లేదు. మీ మామయ్యగారి చెల్లెలు కూతురు లత కూడా ఇక్కడే ఉండేది. పుట్టినప్పటినుంచి లత ఆనంద్ పెళ్ళాం అనే పిలవబడుతూండేది. పెళ్ళి కూడా చేసెయ్యాలనుకున్నాం. కాని, విధి మమ్మల్ని కీలు బొమ్మలుగా చేసింది." విశాలాక్షమ్మ చెబుతూంటే శారద ఆసక్తిగా వింటూంది.

"ఆనంద్ ఎమ్. ఎ. పరీక్షలు తీరితేనే గాని పెళ్ళి వద్దు అన్నాడు. లత కూడా బి. ఎ. లో చేరింది. మీ బావ చిత్రకారుడే కాక, భావ కవి కూడా. వాడికి అల్లుకోవలసిన తీవెలాగే లత కూడా అపురూప సౌందర్యవతి. వాడి చిత్రాలన్నిటిలోనూ లత రూపం కనపడేది. ఇద్దరూ చిలకా గోరింకల్లా ఉండేవారు. కాని, భగవంతునికి మా ఆనందం చూసి ఆడుకోవాలని బుద్ధి పుట్టింది.

ఈ తోటలోనే బావ 'చిత్రాలయ' అని ఒక చిన్న పర్ణశాల లాంటిది కట్టించాడు. చదివే టైమ్ తప్పితే మిగతా కాలమంతా అందులోనే ఉండేవాడు.

ఒక రోజు ఆఖరి పరీక్ష వ్రాసి

## 'ఇందిర'

వచ్చాడు. ఆనంద్, లత కబుర్లాడుతూ టిఫిన్ తింటున్నారు. ఈలోగా నౌకర్ల కేకలు వినపడ్డాయి. చిత్రాలయ భగభగ మండిపోతున్నది. అంతే. ఒక్క ఉరుకున మంటల్లోకి గెంతి లోపలికి వెళ్ళిపోయాడు ఆనంద్. అది చూడగానే నేను స్పృహ కోల్పోయాను. అందరూ ఎలాగో బయటకు తెచ్చారు. ఆనంద్ ప్రాణాలు దక్కాయి కాని, దృష్టి కోల్పోయాడమ్మా."

తుళ్ళిపడింది శారద. 'బావ గుడ్డివాడా!' ఈ నిజాన్ని నమ్మలేకపోతూంది. నోట మాట రాలేదు. కన్నీరు తుడుచుకొని సర్దుకొని మళ్ళీ మొదలెట్టింది విశాలాక్షమ్మ.

"ఈ నిజం నమ్మలేకుండా ఉన్నావు కదూ? దృష్టినే కాదు, శారదా, తన ప్రాణప్రదంగా ప్రేమిస్తూన్న లతను కూడా కోల్పోయాడు" అన్నది. "లత ఎక్కడుంది, అత్తయ్యా?" గొంతు పెగల్చి అడిగింది. "అత్తవారింటిలో." నిర్లిప్తంగా జవాబిచ్చింది విశాలాక్షమ్మ. "బావ ఏక్సిడెంటు అయిన తరవాత లత తండ్రి వచ్చాడు. తనతో లతను తీసుకెళ్ళిపోయాడు. మరికొన్ని రోజుల తరవాత లత పెళ్ళి శుభలేఖ. దానితో లత ఉత్తరం వచ్చింది. బావను తను జీవితాంతం ఆ స్థితిలో చూడలేననీ, అందుచేత నాన్న కుదిర్చిన సంబంధం చేసుకుంటానని వ్రాసింది. ఇందుకు మేము ఆశ్చర్యపోలేదు. ఆనంద్ గురించే భయంగా ఉండేది. కాని, ఈ సంగతి వినగానే నిర్లిప్తంగా నవ్వేసి—'ఇది సహజమే కదమ్మా!' అనేశాడు. అలాగే కాలంతోపాటు మనసులు రాళ్ళు చేసుకొని బ్రతుకుతున్నాం. నాకు కూతుళ్ళు లేరు. కోడలయినా ఇంట్లో తిరుగాడుతుందంటే ఆ అదృష్టం కూడా లేకపోయింది. మీ నాన్న నిన్నిక్కడకు పంపటం మూలాన నా కెంత మేలు జరిగిందో తెలుసా? నాకు సగం చింత తగ్గింది." ఆప్యాయంగా శారద తల నిమిరింది.

"మీ మామయ్య వచ్చే టైమయింది. నువ్వుకూడా భోజనానికి లే, శారదా!" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

శారదమాత్రం ఒక అంగుళం కూడా కదలలేకపోయింది. 'ఇంతవరకూ ఉన్న తన కష్టాల జ్ఞాపకాలు తుడుచుకుపోయి మనసంతా అత్తయ్య మాటలే నిండుకున్నాయి. బావ, లత, అత్తయ్య, మామయ్య తనచుట్టూ తిరుగుతున్నారు. అందులో లత స్వరూపం రాను రాను అదృశ్యమయిపోయింది. ఈ మిగతా ముగ్గురి మధ్య తాను ఆశ్రయం కోసం వచ్చింది. ఆ ఆశ్రయం లభించటమే కాదు, అది ఎంత దృఢమైనదో, ఎంత స్వర్గతుల్యమయిందో తన ఆలోచనలకు అతీతమయింది.

అయితే తను వీరికోసం ఏం చేయగలదు? వారి ఋణం ఎలా తీర్చుకోగలదు? బావ... అత్తయ్య, మామయ్యల దుఃఖం, ఆనందం, ఆశ నిరాశల

కేంద్రం కళాతపస్వి, కళాపిపాసి, భావుకుడు, భావకవి బావ

ఆ బావకు దృష్టిలోపం కావటాన అన్నీ అడుగంటవలసిందేనా? కళ్ళు గుడ్డి అయినంతమాత్రాన భావం గుడ్డి దవుతుందా? కాదు అతనిలో భావస్పందన జీవించాలి దానికి ఆలంబన అవసరం. దానితో బావ తన దుఃఖస్థితిని మరిచి తిరిగి చైతన్యవంతుడౌతాడు అతనిలోని చైతన్యం ఆ ఇంటినే దీప్తివంతం చేయగలదు. అందుకు తన సాయశక్తులా ప్రయత్నించాలి' మనసు నిశ్చయాని కొచ్చింది ఇంతవరకూ తన జీవితం ఎదగలేని గడ్డిమొక్క కాని, ఇక తనలోనూ ఒక లక్ష్యం ఏర్పడింది అర్థంలేని బ్రతుకనుకున్న తాను, అందవికారమని చెప్పబడుతున్న తాను తన జీవితం అర్థవంతం చేసుకుంటూంది

శారదకు తృప్తిగా ఉంది మనసు తేలికగా ఉంది. అత్త పిలుపు విని లేచింది

* * *

కొన్ని రోజులు గడిచేసరికే శారద ఆనంద్ నోటిలో 'శారూ' అని పిలవబడ్డది. ప్రతి విషయం ఆమెతోనే ముచ్చటిస్తాడు. ప్రతి పని ఆమెచేతే చేయించుకుంటాడు. ప్రతి భావవీచిక ఆమెకే వినిపిస్తాడు, ఆమెచేత వ్రాయించుతాడు ఆమె పాడగా వింటూ తన్మయుడౌతాడు. శారదకు వీణ నేర్పించమని తల్లితో చెప్పాడు వెంటనే వీణ కొని ఒక వైణికుని వద్ద నేర్పించటం మొదలుపెట్టారు. ఇద్దరూ షికారుకి వెళతారు. శారద పేపరు చదివితే వింటాడు. పుస్తకాలు చదివించి తర్కించుతాడు. ఒక్కొక్కప్పుడు ప్రశ్న వేస్తుంటాడు. ఆమె చెప్పలేకపోతే తానే చెబుతాడు. శారద తన్మయురాలై వింటుంది.

"శారూ! సృష్టిలో విచిత్రం మానవ సృష్టేనేమో" అంటాడు ఏదో ఆలోచిస్తూ. "నా కంతటి పరిజ్ఞానం లేదు, బావా!" అంటుంది శారద. చిన్నగా నవ్వుతూ ఆనంద్ అర్థ్ధుకుంటాడు. "చూశావా! మనుషు లందర్నీ ఒక్కలాగే సృష్టించాడు. అవయవాలన్నీ ఇచ్చాడు. కాని ప్రతి ఇద్దరి భావాలు కలవలేవు. ఇది విచిత్రం కాదా!"

"అవును, బావా!"

"కాని మనిషికి తృప్తినివ్వలేదు. అందుచేతనే ఎంత ఉన్నా ఇంకా కావాలని కోరుకుంటాడు. అంతరిక్షయానంతో చంద్రమండలం చేరుకున్నా తృప్తి పడలేదు. ఈశ్వర సృష్టినంతా తన చేతికి తెచ్చుకోవాలని తాపత్రయపడతాడు. అలాగే గాలి, వెలుగు [illegible] కాని భావాన్ని సృష్టించగలడా? దేవునితో పోటీ పడి అతీతుడు కాగలడా? మృత్యువుని జయించగలడా?

బిడ్డని ప్రేమించమని తల్లికి ఎవరు నేర్పుతున్నారు? యువతీయువకుల ఆకర్షణ, భార్యాభర్తల అనుబంధం, ఆత్మీయత లోని ఆరాధన—ఇవన్నీ ఎవరు నేర్పిస్తున్నారు?

అడవిలోని మహా వృక్షాలకు ఎవరు నీరు పోస్తున్నారు? సముద్రంలో నీరు ఎవరు నింపుతున్నారు? ఈ అనంత విశ్వంలో భూమి, సూర్య చంద్రులు, నక్షత్ర మండలం ఏ ఆకర్షణ మీద నడుస్తున్నాయి? ఇందులో ఏదేని ఒక్క సెకండు స్తంభించితే ఈ మనుషులు, ఈ సృష్టి ఏమవుతాయి! మనిషి పుడతాడు, చస్తాడు కాని సృష్టి చావదే? ఆమాత్రం దానికి ఎందుకీ తపన, దేనికీ అసంతృప్తి? ఈ జగతిలో మనిషి అనే ప్రాణి సముద్రంలోని నీటి చుక్క, ఒక ఇసుక రేణువు అటువంటి మానవుడు తనే సర్వం, తన మేధకు మించినదీ, లొంగనిదీ లేదనుకోవటం ఎంత అవివేకం! ఆవేశంగా చెప్పుకుపోయేవాడు ఆర్ద్ర హృదయంతో ఆమె వినేది

ఇంకొకప్పుడు—"శారూ! ఏమేం పుస్తకాలు చదివేవు?" అని అడిగేవాడు "ఇక్కడ నువ్వు చదివించినవే, బావా! కలకత్తాలో రామాయణం, భారతం లాంటివి వినటమే తప్ప చదివే వీలు లేకపోయేది" చిన్నగా నవ్వుతూ, "సరే వాటిలో నువ్వు తెలుసుకున్న దేమిటి?" అని అడిగేవాడు మౌనం వహించేది అతనే అందుకునేవాడు

"రామాయణమే కాని, మహాభారతమే కానీ స్త్రీ పాత్రలను అన్యాయం చేశారు. అవి నిజంగా జరిగినవేకానీ, వ్రాసినవేకానీ నాటికీ, నేటికీ తేడా కనపడదు. మనిషి మనుగడ, ఆకర్షణ, కాంక్ష—అన్నీ ఒకటే రామాయణంలో రాముడు తన ప్రజలకోసం తన భార్యను, నిండు చూలాలిని అడవులలో వదిలివేశాడు. అంటే సీత తన భార్య కావటాన ఆమెకు వ్యక్తిత్వం లేదా? ఒక వస్తువును విసిరి పారవేసినట్టు విసిరేయచ్చు, తెచ్చుకోవచ్చు.

అలాగే మహాభారతంలో ద్రౌపదిని తల్లి పంచుకోమన్నదని అయిదుగురూ పరిణయమాడారు అయిదుగురూ అనుభవించారు. ఆఖరికి స్వర్గానికి ధర్మరాజుతో వెళ్ళలేకపోయింది కారణం— తన అయిదుగురి భర్తల్లో ఒకరిపట్ల ఎక్కువ ఆకర్షవంతురాలయిందట.

అంటే పెద్దవారు చేసిన తప్పిదం [illegible] అయిదుగురికి భార్య అయినం దుస తనలో వేరే ఆకర్షణ, అభిమానం ఉండకూడదన్న మాట ఇది ఎక్కడి న్యాయం?

ఏది ఏమయినా ఈ ధర్మాలూ, న్యాయాలూ, శాస్త్రాలూ అన్నీ మనుషులను ఒక్క తాటిమీద నడిపించి, ఒక్క విశ్వాస పతాకం క్రింద బ్రతకాలని జీవితాలకు అవసరమయిన కట్టుబాట్లు చేయటంకోసం విజ్ఞులు కనిపెట్టిన సూత్రాలు కథలుగా, కావ్యాలుగా, గ్రంథాలుగా వర్ధిల్లాయి కాని అన్ని మతాలు, ధర్మాలు పురుషునికోసమే గాని స్త్రీకి సరైన స్థానం ఇవ్వలేదు పురుషుని బలహీనతని సమర్థించటంకోసంఆడదాన్ని అబలగా చేసి, ఆమెను పురుషుని బానిసగా, విలాస వస్తువుగా, పాదదాసిగా చేసి, శాస్త్రాలు లిఖించి మన శరీరంలో, ఆత్మలో జీర్ణింపచేశారు

మహమ్మదీయమతం స్త్రీకి మసీదు ప్రవేశం నిషేధించింది క్రైస్తవ మతంలో ఆడపిల్లలు ఏ ఇతర మతస్థులనైనా పెళ్ళాడి తమ మతం పుచ్చుకొనేటట్లు చేయమని ప్రోత్సహించింది అంటే మత విస్తరణకు ఆమెను సాధనగా ఉపయోగిస్తున్నారు హిందువులలో స్త్రీ చేయకూడని పనులు అసంఖ్యాకాలు

ఇవన్నీ ఆలోచిస్తూంటే భగవానునీ, అతని సృష్టినీ ఏ మతం కూడా సరిగా నిర్వచించలేకపోయిం దనిపిస్తూంది.

నాకప్పుడప్పు డనిపిస్తూంది-ఎందుకీ మందిరాలు? దేనికీ మత ధర్మాలు? ఈ మసీదులు, చర్చిలు ఎందుకు? అన్ని ధర్మాల సారం ఒక్కటే అయినప్పుడు, ఈ సర్వజగతినీ నడిపే శక్తి ఏదో బలమయినది ఉన్నదనీ నమ్ముతున్నప్పుడు ఆ నమ్మకంతోనే ఉండరాదా? అప్పుడు ఈ కలహాలూ, రక్తపాతాలూ, ఈ అవాంఛనీయము, హేయమయిన వైషమ్యాలూ కలగటానికి ఆస్కారంలేదే?"

అలా చెప్పుకుపోతూన్న బావ మాటలలోని సత్యం గ్రహించి తన్మయత్వం పొందేది

* * *

అలాగే మూడేళ్ళు గడిచాయి. ఇప్పుడు శారద పరిపూర్ణురాలు. ఆనంద్‌కి అన్ని విధాలా ఆలంబన శారద ఆనంద్‌లోని చైతన్యం ఆ ఇంటిని దీప్తివంతం చేసింది తన ప్రయత్నంలో శారద కృతకృత్యురాలయింది జగన్నాథం,విశాలాక్షమ్మల హృదయాలలో లీలగా ఒక ఆశ జనించింది. కాని, బయట పడటానికి సాహసించలేదు

శారదకోసం కొన్ని సంబంధాలుకూడా చూశారు కాని శారద ఒప్పుకోలేదు. "అత్తయ్యా! మీ నీడకంటే నేనేమీ ఎక్కువ కోరుకోలేదు నాగతాన్ని పూర్తిగా మరిచిపోయాను ఇప్పుడు నేను దూరమయితే బావ సంగతి ఆలోచించారా? ముందు బావకు మరో ఆసరా చూపించి గాని నా విషయం తలపెట్టవద్దు. ఇది నా ప్రార్థన" అన్నది జగన్నాథం దంపతులలోని స్వార్థం ఆనందించింది వారికి తెలుసు, శారద దూరమయితే నిజంగానే ఆనంద్ గుడ్డివాడౌతాడని

అన్ని విధాలా శారద, ఆనంద్‌లు సన్నిహితు లయినా ఆనంద్ తన ఊహా సౌందర్యం వర్ణించినప్పుడుమాత్రం ఆమెలో బాధ రేగేది ముఖ్యంగా ఆ వర్ణనలు తనవిగా భావించి పాడమనేవాడు ఆ సమయంలో ఎంత నిగ్రహించుకున్నా తన రూపం తనలో నిరాశనే రేకెత్తించేది

ఇలా ఉండగా వారి మేడకు ఎదురుగా ఉన్న పచ్చ మేడలో డాక్టర్ గంగాధరం, ఐ స్పెషలిస్టు దిగారు ఆయన విదేశాలలో చాలా రోజు లుండి స్వదేశం వచ్చి స్వంత ప్రాక్టీసు ఆరంభించారు. జగన్నాథంగారు అతనికి ఆనంద్ గురించి చెప్పారు గంగాధరం గారు ఆనంద్‌ని పరీక్షించి కొలది రోజులలో తన పరికరాలు రావలసి ఉన్నాయని, తరవాత కళ్ళు ఆపరేషన్ చేస్తానని ధైర్యం చెప్పారు. ఆమాత్రం ధైర్యంతోనే ఆ కుటుంబానికి వేయి ఏనుగుల బలం వచ్చింది

గంగాధరం గారి అమ్మాయి విజయ. చదువు, సంస్కారం కలిగి ఉండేది అసమాన సౌందర్యమూర్తి ఆమెతో శారదకు పరిచయమయి, ఆ పరిచయం స్నేహంగా మారింది.

బావ వర్ణనలలోని సౌందర్యం విజయలో చూసేది బావకు ఇలాంటి

---

## రహస్యం

ఆడవారి నోట్లో నువ్వు గింజ నానదు. అంటే, రహస్యాలు నిలవవు కానీ ఆడవారు తమకే తెలియకుండా తమ రహస్యాలు కొన్ని వందలు దాచి పెడతారు సమాజంలో తన గౌరవం పెరిగినకొద్దీ, స్థాయి పెరిగినకొద్దీ రహస్యాలను మరిచిపోవడం జరుగుతుంది.

—ఆస్టిన్ మల్లే

---



# తియ్యని కలలు నిజమవుతాయి

మీగడతో నిండిన ఐస్-క్రీమ్, గులాబ్ జామూన్, చాకొలేట్ ఫడ్జ్, గాజర్ హల్వా, టోఫీ, ఖీర్,
కస్టర్డ్, శ్రీఖండ్, పాయసం, పుడ్డింగు మరియు జెల్లీ, చాకొలేట్ కేక్...

## అమూల్ మిల్క్ పౌడర్‌తో మీకిష్టమైన తీపి పదార్థాలను పసందుగా తయారు చేసుకోండి.

**కలపటం-తేలికైన అమూల్ మిల్క్**
వెచ్చని నీటిలో 10 టేబుల్ స్పూనుల అమూల్ మిల్క్ పౌడర్ వేసి మెత్తని పేస్టుగా కలపండి. దానికి ఒక లీటరు పాలు తయారయ్యేటట్లు వేడి నీటిని చేర్చండి ఒక కప్పు పాలు కావాలంటే, రెండున్నర టేబుల్ స్పూనుల అమూల్ మిల్క్ పౌడర్ కలిపితే సరిపోతుంది.

**గట్టి, మీగడతో కూడిన పెరుగును తయారు చేసుకోండి**
అమూల్ మిల్క్ పౌడర్‌తో తయారు చేసిన పాలను తీసుకోండి. బాగా కాగనివ్వండి గోరువెచ్చగా ఉండేటట్లు చల్లబడనియ్యండి. సగం నుంచి ఒక టీ స్పూను దాకా మంచి పెరుగును ఆ పాలలో వేసి కలియబెట్టండి. తోడుకో నియ్యండి.




**అమూల్**
మిల్క్ పౌడరు
ఉన్న ఇల్లు పాడితో తులతూగు ఇల్లు

( ASP AMP 10 TF)

ార్య లభ్యమయితే? - అనుకునేది. కాని, ావపక్కన విజయను ఊహించుకోలేక ోయేది.

డాక్టర్ ఆసరా ఇచ్చిన దగ్గరనుంచి ఆనంద్‌లో మరో రకం మార్పు పొడచూపింది.

"శారూ! నాకు నిజంగా దృష్టి తిరిగి ;లిగితే ఎంత ధన్యుడను! ఎందుకో తెలుసా? నిన్ను చూడాలని ఎంత ఆశగా ఉందో తెలుసా? నువ్వీ ఇంట ఏ ముహూర్తాన అడుగు పెట్టావో దేవతలా వెలిశావు. నిన్ను కళ్ళారా ఒక్కసారి చూడుకోవాలి. నీలోని తేజస్సు, అందం చూసుకొని గర్వించాలి. ఆ తరవాత మళ్ళీ గుడ్డివాణ్ణయినా చింత లేదు" అనేవాడు. ఆ మాటలు శారదకు సమ్మెట పోట్లలా తగిలేవి. 'తన బావ తనను ఎలా ఊహించుకుంటున్నాడు? నిజంగా ఆ శుభగడియ వస్తే తనను చూచి ఏమనుకుంటాడు?' మరి ఆలోచించలేక పోయేది. రాత్రి పడుకున్నప్పుడు కూడా అలాంటి కలలే వచ్చేవి. బావకు ఆపరేషన్ అయినట్టు, కళ్ళు తెరిచిననాడు తొలిసారిగా తనను చూచి నిరాశతో క్రుంగిపోయినట్టు కలగనేది. 'తను చూడని శారూని ఎంతగా ఊహించుకున్నాను! ఈ రూపాన్ని చూడటానికేనా ఇంతగా తపించిపోయాను?' అని బాధగా కళ్ళు మూసుకుంటున్నట్టు ఊహలు వచ్చేవి.

అందుచేతనే ఆనంద్ ఎంతో పారవశ్యంతో వర్ణిస్తుంటే ఆమెలో కలిగిన మధురోహలు దుఃఖతరంగాలు కాగా 'బావా . . .' అంటూ బాధగా మూలిగేది.

ఎదురుచూసిన సుముహూర్తం రానే వచ్చింది. ఆనంద్‌కి ఆపరేషన్ చేయటానికి తీసుకెళ్ళిన రోజున అతని తల్లితండ్రులకు, శారదకు ఎన్ని భావాలో కలగాపులగంకాగా ఆత్రత, భయం, ఆశ, నిరాశల మధ్య ఊగిపోయారు.

"శారూ! నా కెంతో ఆనందంగా ఉంది. నువ్వు నా దగ్గరున్నంత కాలం నాకు శుభమే జరుగుతుంది. ఒకవేళ ఏమయినా జరిగినా ..."

"బావా ... " అంటూ సున్నితంగా తన చేతివేళ్ళతో అతని నోరు మూసింది. "చెప్పనీ, శారూ ..." అంటూ ఆమె చేతిని మృదువుగా తన గుండెపై పెట్టుకొని, "ఇవే ఆఖరు మాటలు కావచ్చు. నిన్ను చూడలేని ఈ ప్రాణం ఉన్నా ఒకటే, పోయినా ఒకటే. అమ్మ తరవాత మళ్ళీ నిజమయిన ఆదరణ, స్నేహం నీ దగ్గిర పొందగలిగాను. నా దృష్టిలోపం కూడా మరిచిపోయాను. కాని, నీకు ప్రతిఫలంగా ఏమీ ఇవ్వలేను. శారూ! నాదొక్క కోర్కె తీర్చాలి. భగవంతుని కృపవల్ల ఈ ఆపరేషన్ విజయవంత మయితే తొలిసారి నిన్నే చూడాలి. నీ కళ్ళలోని కాంతిలో నేను కరిగిపోతూ నీ కేమి ఇవ్వగలనో ఆ రోజు చెబుతాను. ఈ కోరిక తీరుస్తావా, శారూ!" అని గాద్గదికంగా అడిగాడు. "అలాగే, బావా?" అభయమిచ్చింది. ఆనంద్ చేతితో శారద ముఖమంతా తడిమి, చేతికి తగిలిన తడిని తుడిచాడు

* *

ఆనంద్ కళ్ళకు ఆపరేషన్ జరిగింది. ఆపరేషన్ సక్సెస్ అనీ, కట్లు విప్పిన తరవాత పూర్తిగా దృష్టి వస్తుందో రాదో తెలుస్తుందనీ గంగాధరం చెప్పారు. విశాలాక్షమ్మ, శారద మొక్కని దేవుళ్ళు లేరు. చేయని పూజ లేదు. జగన్నాథం గారు భగవంతుని మీద భారం వేసి ఫలితం కోసం ఎదురుచూస్తున్నారు.

ఆనంద్ ప్రతిరోజూ శారదకు చెబుతున్నాడు. "శారూ, నా కోరిక మరిచి పోవు కదూ?" అంటున్నాడు. డాక్టరుతో- "డాక్టర్! నాకు దృష్టిగాని తిరిగి రాకపోతే ఇంత విషమివ్వండి. ఒక్కసారి నాకు చూపు తెప్పించండి చాలు" అంటున్నాడు. "శారూ, నీ ఆదరణ అందుకున్నాను. నీ స్నేహం చవిచూశాను. నీ మధుర కంఠస్వరం విన్నాను. ఒక్కసారి నీ సౌందర్యం చూడాలి. నా మాట మరిచిపోకు" అంటున్నాడు.

శారద బావకు కనుపించటానికి ఎన్ని విధాలుగానో తన రూపం దిద్దుకో జూచింది. లక్షసార్లు అద్దంలో చూచుకొనేది. కాని, లేని అందం ఎలా తేగలదు? ఏ సౌందర్యం చూపగలదు? 'భగవాన్! ఈ శారూ తను చూడగోరే సౌందర్యమూర్తి కాదని, ఈ రూపంతో తన ఎదుట నిలబడలేదనీ నా బావకు తెలియజెప్పవూ' అని ఎన్నిసార్లో ప్రార్థించింది. తీవ్రంగా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చింది.

మర్నాడు కట్లు విప్పుతారనగా విజయ దగ్గిరికి వెళ్ళింది. తన ఊహ విజయకు చెప్పింది. ఉలిక్కిపడింది విజయ. అది మోసం అని హెచ్చరించింది. కాని, శారద వినలేదు. విజయ కాళ్ళమీద పడింది. "విజయా! నా కీ సహాయం చేయక తప్పదు. ఆ సౌందర్యోపాసకుని కళ్ళ ఎదుట ఈ కురూపి శారద నిలబడ లేదు. అతని దృష్టి మొదట్లు ఒక సౌందర్యరాశి మీదనే పడనీ. ఆ శుభ ఘడియలు విషపూరితం చేయద్దు. ఆ తరవాత ఏ శిక్ష నాకు బావ విధించినా సిద్ధమే!" అన్నది. విజయ కాదనలేక పోయింది.



మైమరచి . . .

చిత్రం : పి. ఆగాచార్య ( కరీంనగర్ )

ఎదురుచూచే ఘడియ రానే వచ్చింది. అందరిలోనూ ఏదో భయం, ఆత్రత నిండి ఉన్నవి. శారద తను చేయబోయే పని అత్తయ్యకు చెప్పింది. ఆమె మందలించబోయినా వినలేదు.

కట్లు విప్పారు. కళ్ళు చిల్చుకొని చూడబోయాడు ఆనంద్. వెలుగు తగలగానే జిగేల్ మన్నాయి. మళ్ళీ కళ్ళు విప్పాడు. చీకటి... కటిక చీకటి. రాను రాను వెలుగు చూడగలుగుతున్నాడు. "శారూ ..." ఆనందంతో కేక వేశాడు. మిగతా వాళ్ళు కూడా పరవశంతో తమని తామే మరిచిపోయారు.

ఎదురుగా ఉన్న విజయను నిశితంగా చూశాడు. అంతే. రెండు చేతులతో ముఖం కప్పుకున్నాడు. "శారూ! నన్ను మోసం చేశావు." "బాబూ..." అని తల్లి దగ్గరకు వెళ్ళబోయింది. "అమ్మా! ఏదీ, నా శారద ఎక్కడ? ఈ అమ్మాయి ఎవరు? నా శారద రూపం నాకు తెలుసునమ్మా! నే నా దేవతను చూడ గోరాను. కాని, నన్ను శారద మోసం చేసింది. నా కెందు కీ దృష్టి? అమ్మా, ఇన్నాళ్ళూ నా కళ్ళు గుడ్డిగాని మనసు కాదమ్మా! నా మనసులో నా శారదను చూచాను. ఆమెలో వేయి అందాలు చూడగలిగాను. శారూ ..." అంటూ దుఃఖిస్తున్న ఆనంద్ పాదాలపై వాలిపోయింది శారద. "నన్ను క్షమించు బావా ..."

ఆమె ముఖాన్ని రెండు చేతులలోకి తీసుకొని తనివితీరా చూచుకుంటూ, "శారూ, నేను కోరిందీ, నీకు ఉన్నదీ ఆత్మసౌందర్యమే. ఇలాంటి బాహ్యసౌందర్య సౌరభాలు ఉన్నా వేయి మంది కూడా నీ దగ్గర సరిపోరు. నీ బావను నువ్వు ఈమాత్రం అర్థం చేసుకోలేక ఇలాంటి శిక్ష విధించావా? ఈ రోజు నీ కివ్వవలసిన దేమిటో తెలుసా? ఈ బావ నీవాడు..." అన్నాడు.

"బావా..." సిగ్గు, దుఃఖం, ఆనందం, తృప్తి అని కలిసిన స్వరంతో అంటూ అతని మోకాలుపై తల వాల్చుకుంది.

జగన్నాథం, విశాలాక్షమ్మల హృదయాలు తృప్తిగా నిశ్వసించాయి.

ఆ గదిలో ఆనందం పురి విప్పి నాట్యమాడింది. ★

# సపట్ మలామ్

తామర, గజ్జి, చిడుము
పాదములమీద మరియు వేళ్ల మధ్య పగుళ్లను
పోగొట్టుటకు దివ్యమైనది.

SAPAT & CO., BOMBAY 2.

ఏజంటు: ట్రేడ్ ప్రమోషన్ కార్పొరేషన్,
బకింగ్‌హాంపేట, విజయవాడ-2.

---

# ఇండియాలో ప్రథమంగా

రిస్టువాచ్ టైపు ట్రాన్సిస్టర్ ప్రపంచ ప్రసిద్ధమైన తాజా జపాన్ మోడల్ "యషికా" మీకు ఆశ్చర్యమైన గొప్ప అవకాశము ఇస్తున్నారు. సాంకేతిక వైజ్ఞానిక ఇంద్రజాలము. మీ అభిమాన కేంద్రాలు విదేశాలను రోజులోని 24 గంటలు ఎక్కడవున్నా ఏ పేరైనా వినవచ్చును. అతినిష్టమైన ... ప్రత్యేకమైన మిని స్పీకర్ రీప్రొడక్షన్ ఇగలదు. శక్తివంతమైన సూపర్ సెన్సిటివ్ ... ప్రతిచోట లభించే చిన్న బ్యాటరీతో పని చేస్తుంది. మావద్ద మాత్రమే లభిస్తుంది మీరు జారవిడ్చుకోరాని అవకాశం. పరిమితమైన సప్లయి హెచ్చుగిరాకి తొందర పడండి

WRIST WATCH TYPE TRANSISTOR

PRICE Rs.98/-

Write today for FREE LITERATURE.

YASHICA JAPAN SUPPLIES 188-A HARI NAGAR ASHRAM NEW DELHI-14

---

# పగటి వలె వెలుగు పొందుటకు!

## బెంగాల్ ఫ్లోరసెంట్ ట్యూబులు

ఆంధ్రప్రదేశ్‌కు సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
జి. ఏ. పరశురామ్ & కంపెనీ
లకిడికా పూల్, హైదరాబాద్-4 ఏ.పి.

---

# శుభవార్త

*

డాకరకు సాధ్యంగాక వదలి వేయబడిన అన్ని వ్యాధులకు చికిత్స చేయబడును. లావుపాటివారు సన్నగను, బలహీనులు బలవంతులుగను చేయబడుదురు. మధుమేహము, రక్తపుపోటు, కుష్ఠు, బొల్లి, కేన్సర్. సంతానము లేనివారు కూడా శ్రీ యోగిగారి చికిత్స వలన సంపూర్ణ ఫలమును బడయగలరు. కావలసిన వారికి కాయకల్ప చికిత్స చేయబడును. ఈ చికిత్స వలన దేహములో వున్న వ్యాధులు తొలగిపోవుటయే గాక నూతన యౌవనము కలుగును. వివరములు కోరువారు పోసు ఖర్చులకు రు. 1—50 పంపవలయును.

శ్రీ యోగాశ్రమము
పెదవాల్తేరు పోస్టు,
విశాఖపటణము

# దానిమ్మ తీర్పు

18 వ శతాబ్దంలో మరాఠా దేశంలో భోర్ అనే చిన్న రాజ్యం ఉండేది. భోర్ నాయకుడైన శంకరజీ నారాయణ 1730 లో చనిపోగా, అతని కుమారుడు నారో శంకర్ — రెండేళ్ళవాడు రాజైనాడు. నారో శంకర్ పసివాడు కావటంవల్ల అతని తల్లి యశోబాయి రాజ్యపాలనా వ్యవహారాలు నిర్వహించేది.

యశోబాయి తన పాలనా కాలంలో మంచి పేరు సంపాదించింది. సమర్థురా లనిపించుకున్నది. ముఖ్యంగా న్యాయ నిర్ణయ విషయాలలో ఆమె సునిశిత మేధాశక్తి, చాతుర్యం అందరినీ ఆశ్చర్యచకితుల్ని చేసేవి.

ఒకసారి భూమి తగాదాలో ఇద్దరు వ్యక్తులు న్యాయస్థానానికి వచ్చారు. ఎవరికి వారే ఆ భూమి తనదేనని ఫిర్యాదు చేశారు. న్యాయం చేకూర్చమని యశోబాయిని ప్రార్థించారు. ఆమె తన మంత్రులలో ఒకరిని పిలిచి, ఆ భూమి తగాదా విషయమై పూర్తిగా పరిశీలన జరిపి తనకు నివేదిక సమర్పించమని కోరింది.

ఆ మంత్రిగారికి లంచాలు తీసుకోవడం ఇష్టం. వ్యాజ్యంలో తల దూర్చిన ఉభయులను చూచాడు. అందులో ఒక పక్షం వారి స్నేహితులు, బంధువులు మంత్రిగారిని కలుసుకుని, బాగా లంచాలు ఇచ్చి ఆయనను తృప్తిపరిచారు. ఇంకేం? ఆయన 'ఆ భూమి' తనకు లంచం ఇచ్చిన వ్యక్తిదే నన్నట్లు నివేదిక తయారుచేసి యశోబాయికి అందజేశాడు. ఆ నివేదిక ఆధారంగా ఆమె 'భూమి'ని మంత్రి చెప్పిన వ్యక్తికే చెందాలని తీర్పు ఇచ్చింది.

హక్కు లేని వానికి ఆస్తి చేజిక్కింది. ఓడిపోయిన వ్యక్తి ఆ స్థలంలో పూర్వం ఒక ఇల్లు కట్టుకుని చాలా సంవత్సరాలు అక్కడ ఉన్నాడు. ఇప్పుడు గెలిచిన వ్యక్తి ఆ ఇంటిని ఖాళీ చేయించి తను ఆక్రమించుకున్నాడు.

ఆ ఇంటి పెరటిలో ఒక దానిమ్మచెట్టు ఉంది. దానిని ఓడిపోయిన వ్యక్తి దొడ్డిలో నాటి, పెంచుకున్నాడు. అతను ఇప్పుడు ఆ ఇల్లు ఖాళీచేసి పోగానే ఒక వింత సంఘటన జరిగింది. దానిమ్మ చెట్టు ఎండిపోసాగింది. రోజురోజుకు ఆకులు, కాయలు రాలి, మోడైపోయింది. ఈ వింతను ఇరుగు పొరుగు వారు అగుబ్బుగా చెప్పుకోసాగారు.

ఆ పచ్చని చెట్టు అలాగ ఎండిపోవడం అపశకునంగా భావించిన పౌరులు కొందరు ఆ వార్త యశోబాయి చెవిని వేశారు. ఆమె ఆశ్చర్యపోయింది.

యశోబాయి తన గుర్రం ఎక్కి సరాసరి ఆ ఇంటికి బయలు దేరింది ఆ వింత చూడడానికి. ప్రజలు చెప్పింది నిజమే. ఆస్తి వివాదంలో 'న్యాయం' లోపించిందని, అందువల్లనే అలాంటి విడ్డూరం జరిగిందని యశోబాయి అనుమానించింది. అన్యాయం జరగడం వల్లనే దానిమ్మ చెట్టు విచారంతో ఎండిపోయిందని ఆమె నమ్మింది. దానిని నాటి, నీరు పోసిన ఆసామికి అన్యాయం జరగడం ఆ చెట్టు సహించలేకపోయింది.

యశోబాయి అంతఃపురానికి తిరిగి రాగానే ఆ వివాదానికి సంబంధించిన సమాచారం యావత్తు తన ముందు ఉంచమని ఉత్తర్వు చేసింది. స్వయంగా ఉభయ పక్షాల వారి ఫిర్యాదులు పరిశీలించింది. అన్యాయం జరిగిందని గ్రహించింది. హక్కు లేని వానికి ఆస్తి దక్కింది. స్వంతదారునికి అన్యాయం జరిగింది. ఆమె వెంటనే ఆ భూమి, ఇల్లు అసలు వ్యక్తికి చెందేటట్లు తీర్పు వ్రాయించి, ఉత్తర్వు జారీచేసింది. ఆవిధంగా ఓ దానిమ్మ చెట్టు న్యాయ నిర్ణయానికి సహకరించింది.

—వి. ఎస్. సుక్తాంకర్




<u>సీరియల్</u>

(క్రిందటి సంచిక తరువాయి)

**పదిహేడు**

-నండూరి విఠల్

'నీది మరీ ఇంత మట్టిబుర్ర అనుకోలేదు, ఆంజనేయులూ!' అన్నాడు చెమ్మగిలిన కళ్లతో, పొరుగింటి ప్లీడరుగారి ఇంట్లో అడుగు పెడుతూనే సీతాపతి.

'ఏం జరిగింది, సీతాపతీ? మరీ అంతేసి మాటలంటున్నావ్?'

'ఓడిపోవడం, ఓడి పడి లేస్తూ ...... ఈ పదిహేనేళ్ల జీవితంలో నాకు అలవాటే. కానీ, నీ సలహా విని, కాపురం చక్కబడుతుందనే కొండంత ఆశతో నువ్వు చెప్పిన దిక్కుమాలిన చిట్కాలను సీతమీద ప్రయోగించి, అవి చేతపడి బెడిసికొట్టినట్టు ఎదురు కొట్టటంతో, నడుం విరిగి క్రింద పడ్డాను, ఆంజనేయులూ!' మూలిగాడు సీతాపతి.

'ఏం జరిగింది, సీతాపతీ?'

'ఓడిపోయాను, ఆంజనేయులూ! ఈ సారి చిత్తుగా ఓడిపోయాను. పచ్చికుండలా పగిలిపోయింది నా గుండె. మళ్లీ అతుకు పెట్టటానికి వీలు లేకుండా విరిగిపోయింది నా నడుం. చిన్ననాటి స్నేహితుడవనీ, ఎదురింటి నెయిబరువనీ, ఫైలు లేకపోయినా బుర్రున్న ప్లీడరువనీ, సిగ్గు విడిచి, మనస్సు విప్పి, నా సంసార రహస్యాలన్నీ, కడిగి కడిగి నీ ముందు ఒలకపోశానే! కాస్తంత సలహా చెప్పి, దోవ చూపించి, నా కాపరం నిలబెట్టు, ఆంజనేయులూ అంటూ కాళ్లావేళ్లా పడి బ్రతిమిలాడానే! చివరకు ఇటువంటి ద్రోహానికి తలపెడతావా?'

'నువ్వు నన్ను అపార్థం చేసుకుంటున్నావ్, సీతాపతీ. చురకత్తుల్లాంటి ఆ రెండు చిట్కాలూ ఎందుకు చెప్పానంటావ్?'

'చురకత్తులా— ఆహా! చురకత్తులే, లే. కాని అవే నాకు ఎదురు తిరిగి చీలుస్తున్నాయి గుండెలను ప్చ్! ఫైలు లేకపోయినా బుర్రుందనుకున్నా. నీ బుర్రలో బంకమన్ను తప్ప మరేం లేదు, ఆంజనేయులూ ఇంత మట్టిబుర్రవనుకోలేదు.'

అదోలా నవ్వాడు ప్లీడరు ఆంజనేయులు.

'ఆ నవ్వెందుకు, ఆంజనేయులూ?'

'కాదు, సీతాపతీ! చిన్నప్పటినుంచీ స్నేహితులమే మనం! నా బుర్ర ఎటువంటిదో తెలుసుకొనటానికి నీ కింత కాలం పట్టిందంటే— అసలు మట్టిబుర్ర నీదో నాదో ఆలోచించు.'

'ఇదంతా నువ్వు చెయ్యాలనే చేశావా అని నా అనుమానం!'

'ఏది?'

'ఎంత రభస జరిగిందో తెలుసా?'

'ఏం జరిగింది, సీతాపతీ?'

'ఏం చెప్పను! ఇంటికి నిప్పంటుకుంది.'

'అంటే— ఎందుకని?'

'నువ్వు రెండు సలహాలు చెప్పావా? ఆ చిట్కాలు రెండూ నిన్ను నమ్మి, తు. చ. తప్పకుండా సీతమీద ప్రయోగించినందుకు.'

'ప్రయోగిస్తే ఏమయింది?'

'నన్నూ, నా కాపరాన్నీ వదిలి, పదిమంది పిల్లల్నీ వెంటబెట్టుకొని, ఇంక జన్మలో నా ముఖం చూడనంటూ పుట్టింటికి వెళ్లిపోతూంది సీత. పకోడీగాణ్ణి పంపింది సెకండు బస్సుకు— తండ్రినీ, మామయ్యనూ తక్షణం పిలుచుకు రమ్మంటూ. గంటకో అరగంటకో దిగుతారు. మా నాన్న సంగతి నీకు తెలుసు. నా అంతం సమీపించింది, ఆంజనేయులూ. సీత సంగతి నాకు తెలుసు. దానికి అసలు కోపం రాదు. వస్తే బ్రహ్మ రుద్రాదు లాపలేరు. అల్పప్రాణిని, అర్భకుణ్ణి— నే నేం నిభాయించుకోగలను? నా కొంప కూలిపోయింది, ఆంజనేయులూ. కారణం నువ్వే. ముమ్మాటికీ నువ్వే.'

గుక్కలు పడుతున్న సీతాపతిని అక్కున జేర్చుకుని సముదాయించి, స్ట్రాంగు కాఫీ తాగించి, స్వయంగా సిగరెట్టు నోట్లో పెట్టి అంటించి, 'కంగారుపడకు, బ్రదర్. జీవితమన్నాక ఇటువంటివి వస్తూంటాయి. బాధ రుఁటే ఎలా? బుర్రలున్న మనుషులం గనక పరిష్కారమార్గం ఎక్కడుందో ఆలోచించాలి గానీ!'

'నీ మాటలు వింటుంటే మళ్లీ రవ్వంత ధైర్యం కలుగుతూంది గానీ, ఆంజనేయులూ, ఈ ఉపద్రవం లోంచి బయటపడే మార్గం చూపించటానికి అసలు

మనకు బుర్రలున్నాయంటావా?'

'ఉన్నాయి, బ్రదర్. మన బుర్రల కేమీ ఢోకా లేదు. శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలని. నువ్వు గాభరా పడి, నన్నింకా గాభరా పెట్టి, బుర్రలు పని చేయకుండా తిమ్మిరెక్కేటట్టు తికమక పెట్టక, అస లేం జరిగిందీ, ఎలా జరిగిందీ, కథ ఎందుకు అడ్డం తిరిగిందీ, కొంపకు ఏ విధంగా నిప్పంటుకుందీ— అసలు కథను సవిస్తరంగా వివరించు, సీతాసతీ. ప్రతి రోగానికీ మందుంటుంది. ప్రతి విషానికీ విరుగుడుంటుంది— బుర్రుండాలి గానీ. చెప్పు— నిదానంగా.'

'మైండ్ గజిబిజిగా ఉంది, ఆంజనేయులూ. కథ ఎక్కడ మొదలు పెట్టి చెప్పాలో అర్థం కావడం లేదు. ఏది ముందు జరిగిందో, ఏది వెనక జరిగిందో అంతా చిక్కుడంలే.'

'పోనీ, నే అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు— సూటిగా.'

'అడుగు, ఆంజనేయులూ.'

'మళ్ళీ పోట్లాట జరిగిందా ఇంట్లో?'

'మళ్ళీ అంటావేమిటి? పెళ్ళయాక అంత ప్రత్యక్ష యుద్ధం ఎరగం. అసలు సీత కంతటి కంఠుకంఠ ముందనే సంగతి నాకు తెలియదు.'

'ఎందుకొచ్చింది పోట్లాట అసలు?'

'అదే నాకూ అంతు చిక్కడంలే. నువ్వు చెప్పినట్టు, నిజానికి అంతకంటె నూరింతలు ఘాటుగా రాత్రి ఒంటిగంట దాకా పొగిడాను సీతను. మళ్ళీ పొక్కరి కాఫీ పెట్టినప్పటినుంచి ఏడు గంటలదాకా పొగిడాను.'

'ఆపొగడ్త?'

## జరిగిన కథ

**పదిహేనేళ్ళు కాపురంచేసి, పదిమంది పిల్లల్ని కన్న తరవాత సీతామహాలక్ష్మిలాంటి ఇల్లాలికి విడాకులు ఇవ్వాలనే తలంపు కలిగింది సీతాపతికి — శ్రీరామచంద్రమూర్తికి. స్నేహితుడు, ప్లీడరు అయిన ఆంజనేయులు సహాయం కోరాడు. ప్లీడరు సలహా ప్రకారం కోర్టు అంగీకరించే తప్పులు వెముదువేయడం ప్రారంభించాడు సీతాపతి .. సీత చేసిన తప్పు మూలంగా అందరితో బంధాలు తెంచుకొని రాజమండ్రి వెళ్ళిపోయాడు సీతాపతి అక్కడ వరసకి మేనమామ అయిన శేషావతారం ఇంటికి చేరాడు శేషావతారం సిఫారసుతో ఉద్యోగం దొరికింది సీతాపతికి. అందరితో లాలూచీపడి నిజంగా నే ప్రయోజకుడయ్యాడనే నమ్మిక భర్తకు కలగజేసి, తనకు ఏమీ తెలియనట్టు నటించి మోసం చేసింది సీత పరీక్ష పాసయేటట్టు చేసింది. బిడలమీద సీతాపతికి అధికారం లేకుండా చేసింది ఎంత తప్పు! అంతా విని సీతను లొంగదీసుకొనే ఉపాయం ఉపదేశించాడు ఆంజనేయులు. భార్యను ప్రసన్నురాలిని చేసుకొనడానికి ప్రయత్నించాడు సీతాపతి. కాని కథ అడ్డం తిరిగింది.**

'ఆపాళాని— పళ్ళం జా ప్రెజెంటన్నావు గదా? మంచి చీరా, జాకెట్టూ, వెన్నా, లడ్డూ, ధవనం, కరివేపాకు, మల్లెలు గట్రా అన్నీ కొని, గాలిపోయిన సైకిల్మీ తోసుకుంటూ, కడిపెడు ఆశలతో, ఇంట్లో అడుగు పెట్టాను.'

'ఆపాళాన?'

'మడి కట్టుకుని వంట చెసుకుంటూంది సీత. తిరగమోత పోపుతోపాటు చిటపటమంటూ, పిల్లల్ని తిట్టిపోస్తూంది. బుసలు కొడుతూ, మండని కట్టె పుల్లల్ని పైకి తోసి ఊదుతూ బుసలు కొడుతూంది. దాని వరస నాకు చిన్నప్పటినుంచీ తెలుసు. అలా బుసలు కొడుతున్న మనిషికి, అల్లంత దూరంగా, మౌనంగా, మధ్యమధ్య నిస్సహాయంగా గుడ్లప్పగించి చూస్తూ తిరగడం, సహనం వహించడం లాభసాటి వ్యవహారమని అనుభవం నాకు చెప్పింది. బజ్జీని పిలిచి, ఆ చిరా, జాకెట్టూ ఇచ్చి "అమ్మకి ప్రెజెంటిచ్చిరావే, తల్లీ" అని పంపాను దూతగా, ధైర్యం చిరిగి. అంతే!'

'అంటే?'

'అంతే, ఆంజనేయులూ, నే చేసిన ఘోరపాపం!'

'ఏం జరిగింది?'

'తరవాత ఏం జరిగిందో, అది ఎటువంటి మాట అందో నేను చెప్పాగూడదు, నువ్వు వినాగూడదు.'

'వినకుండా ఎలా సలహా చెప్పను, సీతాపతీ?'

'అది సిగ్గుపడే విషయం, ఆంజనేయులూ!'

'ఈ కష్టకాలంలో, అటువంటి విషయాలు పట్టించుకోగూడదు. నే చెపుతున్నా— నన్ను నమ్మాలి. జరిగింది చెప్పి తీరాలి. తప్పదు, సీతాపతీ.'

'సరే, విను, ఆంజనేయులూ. చల్లకొచ్చి ముంత దాచడమెందుకు? అది అలా నా మీద నోరు పారేసుకుంటున్నప్పుడు, మన జాయింటు పనిమనిషి అక్కడే ఉంది. ఎలాగూ చెపుతుంది సినిమా చూసొచ్చి కథ చెపుతున్నట్టు వాడకట్టులోని మిసెస్సులందరికీ. నీ దగ్గర దాపరికమెందుకు? అలా చీర, జాకెట్టు పంపానా బజ్జీచేత? రాఘుబాణంలా దూసుకుంటూ వచ్చింది, ఆంజనేయులూ, వంటింట్లోంచి. వస్తూనే కళాపి జల్లినట్టు ఆ చీరా, ఈ జాకెట్టూ నా ముఖాన వేసికొట్టి...'

'నిజం?'

'మనస్సాక్షిగా చెబుతున్నా. కావాలంటే మన జాయింటు పనిమనిషి నడుగు.'

'ఆపాళాన?'

'ఆపాళాన— గయ్ గయ్‌మంటూ గప్పపాదలా మీద పడింది, ఆంజనేయులూ!'

'ఏమంటుంది?'

'మన జాయింటు పనిమనిషి నడుగు. ఒక మాటా, ఓ వరసా? అన్నం తింటున్నావా? అంది. ఇన్నేళ్ళొచ్చాయి ఎందుకూ? అంది. ఏళ్లు రాగానే సరా? అంది. పది మంది పిల్లల్ని కన్నాక ఈ పాడు బుద్ధులేమిటీ? అంది. సిగ్గూ, శరం ఉండక్కర్లే అంది. సంసారి కొంపనుకున్నావా, సానిదాని గుడెసనుకున్నావా అంది. ఒళ్ళు కనిపించే ఈ చీర కట్టుకుని, భుజాలు కత్తిరించిన ఈ జాకెట్టు తొడుక్కుని కులకటానికి నే నేం నీ రమాదేవిని కాదంది.'

'ఉండుండు, సీతాపతీ. ఏమందీ?'

'నీ రమాదేవిని కాదంది.'

పాయింటు నోటు చేసుకున్నాడు ఆంజనేయులు. ఏంతైనా ప్లీడర్గారు.

'ఇంకేమంది, సీతాపతీ?'

'ఇంక నీతో కాపురం చెయ్యనంది.'

'ఇంకా?'

'నా పిల్లలు నాకు చాలంది.'

'ఇంకా?'

'ఇటువంటి బుద్ధని తెలిసుంటే ఎన్నడో పుట్టింటికి లేచ్చక్కాపోయేదాన్నంది.'

'ఇంకా?'

'ఇంకా ఏముంది, ఆంజనేయులూ! పెట్టెలు ధమ ధమ క్రిందకు విసిరి, పుట్టింటికి లేచిపోవడానికి బట్టలు సర్దుకుంటూంది పిల్లల్ని బాదుతూ ఎడా పెడా;'

'ఇందులో ఏదో పొరపాటుంది, సీతాపతి. ఎక్కడో బెడిసి కొట్టింది. నాతో రా. నే మాట్లాడుతా మా చెల్లాయితో ఎందు కిలా జరిగిందో? ఏదో లిటిగేషనుందోయ్ పద, ముఖాముఖి తేల్చుకోవడం మంచిది, పరిస్థితి విషమించకముందు.'

'ఆ ఇంట్లో అడుగు పెట్టడానికి నాకు ధైర్యం చాలడం లేదు, ఆంజనేయులూ.'

'సీతాపతీ! ఎంతయినా కట్టుకున్న భార్య గదా? నిన్ను మింగేస్తుందంటావా?'

'మింగినా ఫర్వాలేదు, ఆంజనేయులూ, గుటుక్కున. కాని, నన్ను ముక్కలు ముక్కలు క్రింద చీల్చి చెండాడి చిత్రహింసలకు గురి చేస్తుంది. ఆ కోపం వేడి నీకు తెలియదు. చాలా కఠినత్వమున్న మనిషి. దయా దాక్షిణ్యాలు లేని రాతిగుండె.'

ఆంజనేయులు ఆలోచించాడు చాలా సేపు. మంచి ఉపాయం తట్టుక్కున తట్టటంతో చిటికె వేసి, 'సీతాపతీ! నీ కేం భయం లేదు, నడు. అంత అవసరమొస్తే— నేను చెప్తానే— ఆ వజ్రాయుధాన్ని ప్రయోగిద్దువుగాని' అన్నాడు.

'ఏ వజ్రాయుధం?'

'జెలసీ— అసూయ— మరో స్త్రీమీద భార్యకు మగని విషయంలో కలగడం గురించి. మరో రంభ నీకు రాసినట్టు ఘాటైన ప్రేమలేఖ వ్రాయడం గురించిన చిట్కా చెప్పలే నిన్న నీకు గోదావరి గట్టుమీద?'

'వ్రాశాను, బ్రదర్!'

'ఏది?'

'పరుపు క్రింద పెట్టాను.'

'సరిగ్గా వ్రాశావా అసలు— నే చెప్పినట్టు?'

'అంత మట్టిబుర్ర కాదు, ఆంజనేయులూ. అంతకంటె పదింతలు ఘాటుగా వ్రాశాను.'

'ఎవరు రాసినట్టు?'

'రమాదేవి— వేలువిడిచిన మేనమామ శేషావతారం మామయ్య కూతురు, నీకు తెలియదూ? పంతులమ్మ చేస్తున్నదీ.'

'గుర్రపుతోక జడ వేసుకు అప్పుడప్పుడు మా ఇంటికి వస్తూంటుందీ?'

'మరే!'

'సరే, పద! మంచిగా ముఖాముఖి మాట్లాడి వ్యవహారం సెటిల్ చేయడానికి ప్రయత్నిద్దాం. కథ ఇంకా అడ్డం తిరిగిందా— చివరకు వజ్రాయుధం ప్రయోగిద్దాం. లే. మరీ అలా నీరు కారిపోకు, సీతాపతీ, మగపుటక పుట్టి. నే ఉన్నాగా, పద. అసలు ఈ పాటికి చాలా కోపం తగ్గిపోయి ఉండాలి. నువ్వు— ఎంతగా ప్రేమిస్తున్నదీ స్పష్టంగుగా నే చెపుతాగా? ఈ ఆలస్యం అమృతం విషం. కదులు, సీతాపతీ. మా జనం దిగక ముందే వ్యవహారం సర్దుకోవడం మంచిది.'

'అవును, ఆంజనేయులూ. ఆ విషయమే మరిచిపోయా. పద, పద.'

ఆంజనేయులు చెయ్యి పుచ్చుకుని సీతాపతిని ఇంటికి తీసుకుపోయాడు. తన ఇల్లనే విషయమే స్ఫురణకు రాక, శత్రుశిబిరంలో రహస్యంగా కాలు పెడుతున్నట్టు అడుగు పెట్టాడు. బయట ఎక్కడా చడీ చప్పిడీ లేదు. ముందు గదిలోకూడా ఎవరూ కనిపించలే. పిల్లలందరూ కట్ట కట్టుకుని ఎక్కడికో వెళ్లినట్టున్నారు. మధ్య గదిలోకి తొంగి చూశాడు సీతాపతి పిల్లిమాదిరి.

నెత్తిమీద పిడుగు పడ్డట్లయి, నివ్వెరపోయి కూలిపోబోతున్న సీతాపతిని, క్రిందపడకుండా పట్టుకుని, రెక్క పుచ్చుకు నడిపించి మంచంమీద కూర్చోపెట్టాడు ఆంజనేయులు.

ఎదురుగుండా చాలా పెద్ద తలకాయలు కనిపించాయి.

మేనమామ ఇరగవరపు సంగమయ్య భార్యాసమేతంగా వచ్చాడు. ఒక మూలగా తల్లి సుమిత్రమ్మ చీదుకుంటూ, పమిటచెంగుతో ముక్కు తుడుచుకుంటూ కూర్చుంది. ఇటుపక్క పెట్టెమీద తండ్రి దశరథరామయ్య బుసలు కొడుతూ పళ్ళు పటపట కొరుకుతున్నాడు. గుమ్మాన్ని ఆనుకుని మౌనంగా నేలమీద గీతలు గీస్తూ, ఏదో కఠోర నిశ్చయానికి వచ్చినట్టు కూర్చుంది గంభీరంగా సీత.

'ఒరేయ్! ఇన్నేళ్ళొచ్చాయి. పదిహేనేళ్లు కాపురం చేసి, పదిమంది పిల్లల్ని కన్న తరవాతకూడా ఈ దుర్బుద్ధులేమిటి? ఆ ఉత్తరం గొడవేమిటి?'

'? ? ?'

'చెప్పరా, అప్రాచ్యుడా? మహాలక్ష్మిలాంటిదే అది. నిన్నొక మనిషిని చేసిందే. అది నీ కిప్పుడు పనికిరాకుండా పోయిందా? మాట్లాడరా? ఇదుగో, ఇద్దరిలో ఒకళ్లం వావాలిక్కడ, చెప్పు. ఏమి టా ఉత్తరం?'

ఒక ఉత్తరం గిరవాటు పెట్టి, 'చదవరా! పెళ్ళాన్ని వదిలి రమ్మంటుందీ ఆ రమ? నువ్వు వస్తావని నమ్మక ముందీ? ఇంత దుర్మార్గానికి తలపెడతావన్నమాట. నిన్ను— నిన్ను' అంటూ లేచాడు తండ్రి దశరథ రామయ్య.

'ఎందుకు, మామయ్యా! తన కంత ఇష్టం లేనప్పుడు, ఆ రమ అంత ప్రాణమైనప్పుడు నాకూ ఇష్టం లేదు ఈ కాపరం. నా పిల్లలు నాకు చాలు. దానితోనే ఊరేగనీండి.' నీరు తిరిగిన కళ్లతో, తన కఠోర నిశ్చయాన్ని ప్రకటించింది సీత.

'తొందర పడకు, సీతమ్మతల్లీ! పదిహేనేళ్ల పండంటి కాపురం. పది మంది రత్నాల్లాంటి బిడ్డలు. తప్పులుంటే సర్దుకుపోవాలి గానీ! ఏరా, కానులూ, ఎన్నడూ లేనిది, ఇప్పుడు పుట్టిందేమిట్రా నీ కిటువంటి పాడుబుద్ధి? మన ఇంటా వంటా లేదు. మీ కాపరాన్ని చూసుకొని ఎంత సంబరపడుతున్నా! చివరకు నా కడుపు కిటువంటి రంపపుకోత పెడతావా?'

శోకాలు పెడుతూంది తల్లి సుమిత్రమ్మ.

'నువ్విలా బాధపడటం అనవసరం, అత్తయ్యా. తన మనస్సు ఇటువంటిదని తెలిస్తే, అస లింత కాలం ఈ ఇంట్లో ఉండేదాన్నే కాదు ఈ మనిషితో. ఇంక ఒక్క క్షణం ఉండదలుచుకోలేదు.'

'సీతమ్మ తల్లీ, అంతమాటనకు!'

'ఈ ఇంట్లో నాకు చోటు లేదత్తయ్యా!'

'నీ కెందుకు చోటు లేదమ్మా? చోటు లేనిది వాడికి. ఉండు నే చెపుతా. ఉరేయ్! బయటకు నడు.'

లేచి నించున్నాడు సీతాపతి.

అంతవరకూ చప్పిడి చేయకుండా కూర్చున్న ఆంజనేయులు పెద్ద చప్పిడి చేస్తూ పెద్ద పెట్టున నవ్వాడు.

'ఏమిటా నవ్వు, అంజనం?' అంటూ మందలించాడు దశరథరామయ్య.

ఇంకా పెద్ద పెట్టున నవ్వాడు ఆంజనేయులు.

'నీ కేం బుర్ర తిరగడం లేదుగదా?'

'ఇప్పటిదాకా తిరిగింది. ఇప్పుడే ఆగింది. అసలు జరిగిన కథ వింటే మీ బుర్రలు తిరగడం మొదలు పెడతాయి.' మరీ పెద్దపెట్టున నవ్వాడు.

'ఏమిటయ్యా గోల?'

'బాబయ్యగారూ, పిన్నిగారూ, మామయ్యగారూ, అత్తయ్యగారూ, మీ రందరూ రవ్వంత శాంతం వహించి, అసలు కథ వినాలి. సీతమ్మతల్లీ, నువ్వు ముఖ్యంగా. నిజానికి సీతాపతి, సాక్షాత్తూ అసలు సిసలు శ్రీరామచంద్రమూర్తి వంటి ఏకపత్నీవ్రతుడు, ఇటువంటి అఘాయిత్యానికి తలపెట్టాడంటే మీరు మాత్రం ఎలా నమ్మారు? కన్న తల్లిదండ్రులై ఉండీ కన్య ధార పోసిన అత్తమామలై ఉండీ? నువ్వు ఎలా నమ్మావు, సీతమ్మతల్లీ— మీ ఆయన ఇటువంటి ప్రయోజకుడంటే? అసలేం జరిగిందంటే.

'ఏమిటి నువ్వు చెప్పుతూంటు, ఆంజనేయులూ?'

'మొదటినుంచి చెప్పుకొస్తా. ఈ మధ్య ఓ రోజు సీతాపతి నా దగ్గరికొచ్చాడు.

కథంతా, జరిగిన గాథంతా తాను చెప్పిన చిట్కాలతో సహా సవివరంగా, కోర్టులో ఫైనలు ఆర్గ్యుమెంట్లు చెబుతున్నంత పకడ్బందీగా చెప్పి, చివరకు మళ్లీ ఫక్కున నవ్వాడు ఆంజనేయులు.

* * *

'క్షమించు, సీతా!'

'అయిపోయిందిగా!'

'కోపం తగ్గలే?'

'తగ్గినట్లేలే.'

'ఈ రోజు మన పెళ్లిరోజు.'

'మహ బాగా చేశావ్!'

'ఈ ఒక్క రోజూ నా మాట వినాలి, సీతా, నువ్వు.'

'నిద్రొస్తూంది.'

'నే తెచ్చిన కొత్త బట్టలు నువ్వు కట్టుకోనే లేదు.'

'ఆ చీరా, జాకెట్టూనా? నీకేమన్నా మతి పోయిందా, బావా!'

'ఒక్కసారి కట్టుకోవాలి, సితా. నామీద ఒట్టు మరి. ఊఁ.'

'బాగుంది, బావా, నీ వరస! ఎవరన్నా చూస్తే నవ్విపోతారు.'

'ఎవరన్నా ఎందుకు చూడాలి. ఒక్కణ్ణే నే మనసు పడి కొన్న బట్టలు, ఈ పండగరోజు నువ్వు కట్టుకుంటేనే నాకు మనశ్శాంతి ఉంటుంది. సీతా, సీతా, సీతా!'

'అబ్బ, ఉడుంపట్టు, బాబూ, నీది. నీ మాటే వెగ్గాలంటావ్!'

'లే మరి, సీతా!'

లేచింది సీత.

'పది నిమిషాలలో తెమలాలి నీ ముస్తాబు, సీతా!'

నిలువుటద్దం ముందు సీతాపతి కొన్న బట్టలు కట్టుకుని, మనసు పడిన విధంగా సింగారించుకుని, గది గడియ తీసి, 'బావా! బాగుందా చీర' అనేసరికి మూడుగంటల పదహారు నిమిషాలు పట్టింది.

'బావా!' అంది కదిలించి సీత.

ఇంకెక్కడి బావ! పగలు పడిన కష్టానికి గురకపెట్టి, నిద్రపోతున్నాడు. పిలిచి పిలిచి విసుగొచ్చి, చెంబెడు నీళ్ళు గుమ్మరించింది ముఖంమీద. తుళ్లి పడి లేచి, మసక మసకగా చూసి, ఆవలించి, ఒళ్లు విరుచుకుని, కళ్లు మూసుకొని పడుకోబోతున్న సీతాపతి చెవులు పీకి, జుట్టు పీకి, రెక్క పుచ్చుకు లాగి కూర్చోపెట్టింది సీత.

'ఏమిటి, సితా, పడుకోనీకుండా? పగలల్లా అంత అలిసిపోయానా?'

'ఈ వేళ మన పెళ్లిరోజన్నావ్? తెల్లవారేదాకా కడిపెడు కబుర్లు చెబుతానన్నావ్? భలేవాడివి, బావా? నిజమనుకున్నా!'

తేలు కుట్టినట్లు ఎగిరిపడి లేచి కూర్చున్నాడు సీతాపతి. 'అవునుసుమా! మరిచిపోయా' అంటూ సీతను నఖశిఖపర్యంతం తేరిపారచూసి కాపురాని కొచ్చిన కొత్తల్లో పిలిచినంత మెత్తగా పిలిచాడు సీతాపతి.

'సీతా!'

'కాసులుబావా!'

(సమాప్తం)




## వేమన - పాశ్చాత్యులు

[తెలుగుసేత. శ్రీ మరువూరు కోదండరామరెడ్డి, ప్రకాశకులు: వర్ధమాన సమాజము, నెల్లూరు. డెమ్మి 16+168 పుటలు. మేలుప్రతి వెల: రు. 5-00; సాదారణప్రతి వెల: రు. 4-00.]

త్రాను హిందూమతానికి చెందినా జాతి మతాచారాల మీదా, మూఢ విశ్వాసాలమీదా, కర్మకాండపైన ధ్వజమెత్తి, ఎన్నో సత్యాలనూ, నీతులనూ చిన్న చిన్న ఆటవెలదులలోనూ, కందపద్యాల్లోనూ లోకానికి అందించి ప్రజాబాహుళ్యం ఆదరాన్ని చూరగొని శాశ్వత కీర్తిని గడించిన యోగివేమనకవి. తమిళంలో వళ్ళువరుకి, కన్నడంలో సర్వజ్ఞుడికీ ఉన్న కీర్తికంటెకూడా తెలుగులో వేమనకు ఉన్న ప్రచారం, కీర్తి గొప్పవి. ఈయనను గురించిన చరిత్రగ్రంథాలు తెలుగులో ఎన్నో ఉన్నవి. కాని, మనవారికంటె పాశ్చాత్యులే ఇతని విశిష్టతను గ్రహించి ఇతనిని గురించి ఎన్నో విషయాలను ఆంగ్లంలో తెలియజేశారు. తెలుగు రచనల కన్న వాటి విలువే ఎక్కువ. ఇటీవల శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు ఆంగ్లంలో రచించిన గ్రంథమే వేమన కీర్తిని విశ్వవ్యాప్తంగా చెయ్యడానికి ఎంతో సహకరించింది. ఆంధ్రాంగ్లాలలో అపార కృషి చేసి, అనువాదాన్ని మూలవిరోధంగా అనాయాసంగా చక్కని శైలిలో సాగించగల సమర్థులు శ్రీ మరువూరు కోదండరామరెడ్డిగారు ప్రధానంగా పాశ్చాత్యులు వేమనను గూర్చి చెప్పిన విషయాలను సేకరించి వాటిని ఆంధ్రీకరిస్తూ 'వేమన—పాశ్చాత్యులు' అనే ఈ గ్రంథాన్ని రచించి, వాకాడు ధర్మసంస్థల అధినేత శ్రీ రామకృష్ణారెడ్డిగారి సౌహార్దంతో నెల్లూరు వర్ధమాన సమాజం పక్షాన ప్రకటింపజేశారు.

ఇందులో పాశ్చాత్య విద్వాంసులు వ్రాసిన వాటి అనువాదాలే కాకుండా శ్రీ నార్లవారి పీఠికాభాగాలను, శ్రీ సి. ఆర్. రెడ్డిగారి ఉపన్యాసభాగాలనుకూడా అనువదించి గ్రంథానికి మెరుగు పెట్టారు. మొదట్లో పై అనువాదాలను ఇచ్చి, తరవాత సి. పి. బ్రౌన్ తెలిపిన అంశాలను 20 పుటల్లో తెలిపారు. తరువాత ప్రజాకవుల్లో మహాకవి అయినవాడు వేమన ఒక్కడే అని తెలిపే క్యాంబెల్ ఆశయాన్ని వివరించారు. వేమన ఒక తిరుగుబాటు కవి అనే ఆమ్యాన్ డొనాల్డ్ ఆశయాన్ని సప్రమాణంగా వ్యక్తం చేశారు. వేమన గొప్ప ఉపదేశకుడు ప్రవక్త అనే బార్నెట్ సిద్ధాంతాన్ని వెల్లడించారు. అతడు లోక కవి అని తెలిపిన గోవర్ భావాన్ని విపులీకరించారు. హెన్రీ బవర్స్ తెలిపిన యుగ పురోగామిత్వాన్ని వివరించారు. గ్రిబిల్ కడప జిల్లా మాన్యువల్‌లో చెప్పినదాన్ని గ్రంథం చివర చేర్చారు. ఇవన్నీ వేరు ఎన్నో గ్రంథాలలో ఉన్న విషయాలను ఒక్క చోటనే అందజేస్తూ పాఠకునికి వేమన మనోగాంభీర్యంతో అతని వ్యక్తిత్వాన్ని కళ్ళకు కట్టిస్తున్నవి. వేమనను గురించి నిష్పక్షికంగా తెలుసుకోవాలంటే ఈ గ్రంథాన్ని చదవడం అవసరం!

గ్రంథాదిని ఉన్న ప్రశస్తి, అవతారిక, నివేదన, గ్రంథం చివర ఉన్న అనువాదకుని జీవిత విశేషాలు అసలు గ్రంథానికి మెరుగును కూరుస్తున్నవి.

ఇట్టి గ్రంథాలు చక్కగా అచ్చులో వస్తే వాటి విలువ హెచ్చుతుంది. మద్రాసులోని శ్రీనివాస ప్రెస్ వారు ఈ ఉత్తమ గ్రంథాన్ని అత్యుత్తమంగా ముద్రించారు.

## అవతారికలు - చరిత్ర

(కర్త: శ్రీ తిరాల సత్యనారాయణశర్మ. ప్రతులకు: విజయభారతి నిలయం, నల్గొండ. డెమ్మీ 192 పేజీలు. వెల: రు. 5-00.)

మన ప్రాచీన కవులు ప్రబంధాలు రచించినారే కాని చరిత్రగ్రంథాలను రచింపలేదు. అందువల్ల ఆయా కాలాల్లోని చరిత్రను తెలుసుకొనుటకు తగిన అవకాశం లేకపోయింది. కథాంశానికేకాని, చరిత్రాంశాలకు వారు ప్రాధాన్యం ఇవ్వలేదు. సాహిత్యంతోపాటు చరిత్రకున్నూ ప్రాధాన్యం ఇచ్చి, ఆయా కాలాల్లోని చరిత్రను తెలుసుకొనుటకు ఇప్పటికీ పరిశోధకులెందరో గట్టి ప్రయత్నాలు చేస్తున్నారు. అట్టివారిలో ఈ రచయిత ఒకరు. ఈయన ఇదివరకే రాచకొండ చరిత్ర మున్నగు చరిత్రగ్రంథాలనూ, ఎన్నో చారిత్రకాంశాలనూ తెలియజేసే వ్యాసభారతులను రచించి ఉన్నారు. మన ప్రాచీన ప్రబంధములనూ, ద్విపద కావ్యాలనూ పరిశీలించి వాటిలోని అవతారికలు ఆధారంగా అనేక చరిత్రాంశాలను సప్రమాణంగా వివరిస్తూ ఈ గ్రంథాన్ని రచించారు.

ఇందులో పాల్కురికి సోమనాథుని బసవ పురాణ పండితారాధ్య చరిత్రలు, భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం, మార్కండేయ పురాణం, మడికి సింగన జ్ఞానవాసిష్ఠ రామాయణం, సకలనీతి సమ్మతాలు, గౌరనార్యుని కృతులు, శైవకవి కవి గజాంకుశ శ్రీ రంగమాహాత్మ్యాలు, దోనేరుపల్లి సిద్ధేశ్వర చరిత్రలను పరిశీలించి చరిత్రాంశాలు వివరింపబడి ఉన్నాయి. వీటిలో రచయిత చెప్పిన విషయాలకంటె ఉదాహృత గ్రంథభాగాలే ఎక్కువ పుటలను ఆక్రమించాయి. చరిత్ర విషయాలను తెలపడమే ప్రధానోద్దేశంగా గల ఈ రచయిత వాదోపవాదాలకు దిగకుండా ఉండడం ప్రశంసనీయమే!

ముద్రణ అందంగా లేదు. 28, 29 పంక్తులు ఉండవలసిన చాలా పుటల్లో 18, 19, 20 పంక్తులే కూర్చడం పుస్తకం అందాన్ని దెబ్బకొట్టింది. శ్రద్ధగా ముద్రిస్తే ఎన్నో పుటలను తగ్గించడానికి అవకాశం ఉండేది.

—ఆయాస్య

Printed and Published on behalf of Andhra Prabha Private Ltd., by M. KRISHNASWAMI B.A., B.L. at the Dinamani Press, Express Estates, Madras-2. Editor: P. NAGESWARARAO.